# భరత మాతకన్న సుందర స్వప్నం



మీ వంటి మహిమాన్విత మూర్తిని మళ్ళీ చూడగలగడం సాధ్యమా?

# భారత జాతి చేజార్చుకున్న స్వర్గం

కిరాతకుల కసాయి తనానికి రాజీవ్ గాంధీ బలైపోయి నేటికి ( మే 21 తేది ) సంవత్సరం పూర్తయినా, ఆ మహిమాన్విత మూర్తి మనల్ని వదలి, ఎప్పటికీ తిరిగిరాని లోకాలకు తరలి పోయాడన్న నిజం నాకింకా నమ్మబుద్ధి కావడం లేదు. దశాబ్దం

ఆయన ప్రక్కనే వున్నాను. 1991 మే 21 తేది ఉదయం ఒరిస్సా గ్రా_ పర్యటన నుంచి వచ్చిన ఆయనకు శ్రీకాకుళంలో నేనే స్వాగతం చెప్పాను. ఆ రోజంతా శ్రీకాకుళం, విశాఖపట్టణం, విజయనగరం, తూర్పు గోదావరి జిల్లాలలో ఆయన వెంటే తిరిగాను.

మార్చుకున్నారు. ఆయనకు మాట ఇచ్చిన ప్రకారం, సాయంత్రానికి మాసిన గుడ్డలన్నీ ఉతికి, ఇస్త్రీ చేసి,

స్పెషల్ ఎయిర్ క్రాఫ్ట్ సాంకేతిక కారణాల వల్ల ఆ రాత్రికి బయలు దేరే పరిస్థితిలో లేదని చెప్పారు. ఆ మాట

తీసు కోవడం మంచిదనుకుంటాను అన్నారు. అయితే ఎయిర్ పోర్టు నుంచి గెస్ట్ హౌస్‌కు వెళ్ళే దారిలోనే, కారులో

22–5–1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి :63 సంచిక :20 విడిప్రతి : రు. 1.50 లు

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

శ్రీ ఎన్. జనార్దన రెడ్డి
ముఖ్యమంత్రి

కూడా లేని స్వల్ప రాజకీయ జీవితంలోనే లక్షలాది ప్రజలకు రాజీవ్ గాంధీ వ్యక్తిగతంగా అభిమాన పాత్రుడై నాడు; తన వియోగం ద్వారా వారందరికీ విషాద భరిత శూన్యం మిగిల్చాడు.

రాజీవ్ గాంధీ దుర్మరణానికి కొద్ది గంటల ముందు వరకు నేను

శ్రీకాకుళం చేరే సరికి రాజీవ్‌జీ గుడ్డలు బాగా మాసిపోయి వుండినాయి. డ్రెస్ చేంజ్ చేసుకుంటే బాగుంటుందని నేను సలహా ఇస్తే, నాదగ్గర చాలా కొద్ది జతలే మిగిలివున్నాయి, మారిస్తే తర్వాత ఇబ్బంది అన్నారాయన. అయితే నేను బలవంతం చేయడంతో ప్రక్కనే వున్న ఒక ఎలిమెంటరీ స్కూలులో వస్త్రా_లు

సాయంత్రానికి విశాఖ పట్టణం చేర్పించే ఏర్పాటు నేనే చేశాను.

మేము విశాఖపట్టణం ఎయిర్ పోర్టు చేరేసరికి మద్రాసుకు వెళ్ళవలసిన

వినగానే రాజీవ్ జీ కారు వెనక్కు తిప్పమని . ' ఛలో.... క్యాకిగేన్ జనార్దన్, ఈ రోజు కార్యక్రమాలు ఇంతటితో ఆపి, విశాఖలో విశ్రాంతి

వున్నపుడే సందేశం అందింది–సాంకేతిక లోపం సరిచేసి, విమానం

కొరవ 2 పేజీలో

# ప్రజలతో కలవాలంటే ఆయన కెంతో ప్రీతి !

ప్రయాణానికి సిద్ధంగా పెట్టారని; దారిలోనే వెనుదిరిగి వచ్చి ఎయిర్ పోర్టుకు వెళ్ళాం. మద్రాసు చేరే టప్పటికి రాత్రి 8.30 అయింది. మద్రాసు విమానాశ్రయంలోనే నేను సెలవు తీసుకొని, ఎన్నికల ప్రచారానికి సూళ్ళూరు పేట బయలుదేరాను. నాయుడు పేటఎన్నికల సభలో మాట్లాడుతున్నపుడు ఇంటలిజెన్స్ అన్నతాధి కారి వచ్చి చెవిలో చెప్పారు- రాజీవ్ గాంధిని దారుణంగా హత్యచేశారని. ఆ మాట నేను నమ్మలేక పోయాను. గొంతు మూగ బోయింది. మనసు శూన్యమై పోయింది. ఆ షాక్ నుంచి తేరుకోగానే ఆఘమేఘాల మీద మద్రాసుకు బయలు దేరాను. విమానం వెళ్ళిపోయింది. వెళ్ళి పోయినట్లుగానే వుండి వుంటే, ఆ రాత్రికి విశాఖపట్టణంలో మకాం చేసి వుంటే, భారత జాతి ఆ అమృత మూర్తిని కోల్పోకుండా వుండేది గదా అన్పించింది.

రాజీవ్ రాజకీయ ప్రవేశం చేయక ముందు ఆయనతో నాకు పరిచయం చాలా తక్కువ. 1972-78 ల మధ్య కాలంలో రాజ్యసభ సభ్యుడిగా నేను తరచు ఇందిరమ్మ ఇంటికి వెళ్ళే వాడిని. 1977 లో ఆమె ఓటమి తర్వాత ఆ ఇంటికి నా రాకపోకల సంఖ్య బాగా పెరిగింది. అప్పటి నుంచే ఆమె నన్ను వారి కుటుంబ సభ్యులలో ఒకడిగా భావించేది. నేను ఎంత తరచుగా వారి ఇంటికి వెళ్ళినా, రాజీవ్‌ను కలిసే సందర్భమే ఎదురు కాలేదు. ఇండియన్ ఎయిర్ లైన్స్ పైలట్‌గా తన ఉద్యోగం, తన కుటుంబం తప్ప వేరే ప్రపంచంతో సంబంధం లేకుండా గడిపే వాడాయన. ప్రజలతో కలవడానికి సిగ్గు పడేవారు. 1978 లో ఒక సారి ఆయన అర్.కె. భవన్ గదిలోకి వచ్చినప్పుడే నేను ఆయన్ను మొదటి సారి చూడడం! గదిలోకి రాగానే ఈ ఫోన్ వాడుకోవచ్చా అని మర్యాద పూర్వకంగా భవన్‌ను అడిగి, ఫోన్‌లో మాట్లాడి, నిశ్శబ్దంగా గదినుంచి బయటకు వెళ్ళి పోయారు. రాజీవ్ గాంధి నిరాడంబరజీవితానికి దర్పణం పట్టే ఈ సంఘటన నా స్మృతి పథంలో శాశ్వతంగా నిల్చిపోయింది.

1980 లో సోదరుడు సంజయ్ గాంధీ విషాద మరణం తర్వాత,తల్లి ఇందిరాగాంధీ ఎంతో బలవంతం చేయడంతో, అయిష్టం గానే ఆయన రాజకీయాలలోకి ప్రవేశించారు. రాజకీయాల లోకి వచ్చేందుకు కొన్ని నెలల ముందు రాజీవ్ గాంధి

**సుందర స్వప్నం**
(మొదటి పేజీ కొరవ)

హైదరాబాదు, ఢిల్లీల మధ్య నడిచే విమానాలకు పైలట్‌గా వ్యవహరించేవారు. ఇందిరమ్మకు అందుబాటులో వుండడం కోసం ఈ రూట్‌ను ఎన్నుకున్నారు. అయితే తాను హైదరాబాదుకు వచ్చే విషయం ఆయన చాలా గోప్యంగా వుంచేవారు. ఆయన రాకపోకల విషయంపై ముందుగా సమాచారం తెలిసే అతి కొద్ది మందిలో నేను ఒకడిని కావడం నా అదృష్టం. ఆయన హైదరాబాదు వచ్చినపుడల్లా నేను ఎయిర్ పోర్టుకు వెళ్ళి, కొద్దిసేపు మాట్లాడి వచ్చేవాడిని.

ఈ సమయంలోనే రాజీవ్ గాంధి ఒకసారి తన తల్లితోటి మదనపల్లె వచ్చారు. అక్కడ రిషివ్యాలి స్కూలులో తన పిల్లలను చేర్చే విషయంపై వివరాలు సేకరించారు. ప్రఖ్యాత వేదాంతి జిడ్డు కృష్ణమూర్తి స్థాపించిన ఈ స్కూలు గురించి శ్రీమతి ఇందిరాగాంధికి స్నేహితు రాలైన శ్రీమతి ప్రఫుల్ జయకర్ చెప్పినట్లున్నారు. అధికారిక కార్యక్రమాలన్నీ పూర్తయిన తర్వాత, ఆయన నా దగ్గరకు వచ్చి, దగ్గరలోని ఏదో ఒక గ్రామానికి తనను తీసుక వెళ్ళమని కోరారు. "హెలికాప్టర్‌లో వచ్చేటప్పుడు ఈ ప్రాంతపు అద్భుత సౌందర్యం మనసుకు హత్తుకునే టట్లు కన్పడింది; ఆ పల్లెటూళ్ళలోని పరిశుభ్రత ఆశ్చర్యపరుస్తున్నది; నేను మీ గ్రామాల గురించి మరి కొంత తెలుసుకోవాలనుకుంటున్నాను.' అన్నారాయన. వెంటనే ఇద్దరం కలిసి ప్రక్కనుండే గ్రామానికి వెళ్ళాం. డ్రైవరు కూడా మా వెంట రాలేదు. నేనే కారు తోలాను. ఇద్దరం ఒక చెట్టు క్రింద రచ్చబండపై కూర్చున్నాం. అది గమనించిన గ్రామస్థులు మా చుట్టూ మూగారు. పలువురు బుట్టలతో వేరు శెనగ కాయలు తెచ్చి ఇవ్వజూపారు. రాజీవ్ గాంధి అందరి బుట్టలలోనుంచి కొద్ది కొద్ది కాయలు తీసుకొని, వారు తనపట్ల ప్రదర్శించిన ప్రేమాభిమానాలకు ఉక్కిరి బిక్కిరైనట్లు చెప్పారు. నాతో తిరిగి, రిషివ్యాలి లోని తల్లి దగ్గరకు రాగానే, ఆగ్రామంలో జరిగిందంతా ఆమెకు వివరించారు. ఆ గ్రామస్త్రుల ప్రేమాభిమానాలను రాజీవ్ మాటల్లో, విన్న ఇందిరమ్మ వుండబట్టలేక తననూ ఒక గ్రామానికి తీసుక వెళ్ళమని కోరారు. తనతోటి సెక్యూరిటి సిబ్బంది వుండకూడదని . ముందుగా గ్రామస్థులకు తన రాక విషయం చెప్పకూడదని ఆమె షరతు పెట్టడంతో నాకు ఏమి చేయా— పాలుపోలేదు.



హైదరాబాదులో ఒక సందర్భంలో రాజీవ్‌కు సన్నిహితంగా వున్న జనార్ధన రెడ్డి

ప్రజలతో కలిసి పోవాలన్న ఆమె కోరికను కాదనేందుకు మనసు రాలేదు; ఎంతో రిస్క్ తీసుకుంటున్నానని తెలిసీ, ఆమె ఆనందాన్ని పాడుచేయడం ఇష్టం లేక, రిషివ్యాలి ప్రక్కనే వున్న తెట్టు గ్రామానికి తీసుక వెళ్ళాను. ఆమె తోటి రాజీవ్ , సోనియా గాంధి, ప్రియాంక, రాహుల్‌లు కూడా వచ్చారు. కారు నుంచి మేము దిగగానే గ్రామస్థులు ఇందిరమ్మను గమనించి ఆనందం పట్టలేక పోయారు. కొద్దిసేపు గ్రామంలోని వీధులలో. తిరిగి, రచ్చబండపై కూర్చున్నారు ఇందిరాగాంధి. గ్రామస్థులు బెర్రీ ఫలాలు ఇస్తే, రాజీవ్ తో సహా అందరూ అభిమానంగా తిన్నారు. కొందరు గ్రామస్త్రులు జానపద నృత్యం ప్రదర్శిస్తే ఆసక్తిగా చూశారు. ఈలోగా సెక్యూరిటి సిబ్బంది ఆపసోపాలు పడుతూ మేమున్న ప్రదేశానికి వచ్చి, వచ్చి, తమకు చెప్పకుండా ప్రధాన మంత్రిని తీసుక వచ్చినందుకు నాపై విరుచుక పడ్డారు. ఈ సంఘటన భారత దేశాన్ని, భారత ప్రజలను సన్ని హితంగా అధ్యయనం చేయాలన్న రాజీవ్‌గాంధి తపనను ప్రతిఫలింప జేస్తుంది.

రాజీవ్ రాజకీయ ప్రవేశం చేసింది మే 1981 లో; ఈ లోకం నుంచి నిష్క్రమించింది మే 1991 లో! కేవలం పదేళ్ళు మాత్రమే ఆయన ప్రజా జీవితంలో గడిపారు. ఈ స్వల్పకాలంలోనే ఆయన రాజకీయ వాదిగా ఎంతో ఉన్నతికి ఎదగడంతో పాటు, భారత రాజకీయ వ్యవస్థలో విప్లవాత్మక మార్పులను ప్రవేశపెట్టారు. సంతోషం, సరదా స్వభావం, స్నేహభావం, సంస్కారం మానవతావాదం మూర్తీభవించిన రాజీవ్ వంటి నాయకుడ్ని భారత దేశం ఇంతకు

కొరవ 10 పేజీలో

# జమీన్‌రైతు

## రాకెట్ విజయం

భారతదేశ ప్రతిష్ఠను గగనాంతర సీమలో ఎగుర వేయదానికా అన్నట్లు ఎఎస్ఎల్‌వి రాకెట్ ఆకాశం లోకి దూసుక వెళ్లింది. 20 తేది ఉదయం 8 గంటలకు, శ్రీ హరి కోట కేంద్రం నుంచి నిప్పులు చిమ్ముకుంటూ నింగి కెగసిన ఎఎస్ఎల్‌వి. ప్రయోగంతో, భారతదేశం రాకెట్ టెక్నాలజీ కల్గిన అతి కొద్ది దేశాలలో ఒకటిగా మన్నన పొందుతుంది. ఈ శుభముహూర్తం కోసం రెండు దశాబ్దాల నుంచి ఎదురు చూస్తున్న శాస్త్రవేత్తల సంతోషాతి శయానికి ఆకాశమే హద్దు.

రోదసిలో పరిభ్రమించే ఉపగ్రహ నిర్మాణంలో భారత శాస్త్రవేత్తలు ఎప్పుడో విజయం సాధించారు. కాని తయారైన ఉపగ్రహాలను పైకి పంపే పరిజ్ఞానం మాత్రం మనకిప్పటి వరకు లేదు. శ్రీ హరి కోటలో రాకెట్ కేంద్రం స్థాపించిన నాటి నుంచి ఆ విషయమై ప్రయోగాలు జరుగుతూనే వున్నాయి. పన్నెండేళ్ల క్రితం తొలిసారిగా ప్రయోగాత్మకంగా 'శాటిలైట్ లాంచ్ వెహికల్' ప్రయోగిస్తే, అది విజయవంతంగా ఆకాశాని కెగిరింది. ఆ తర్వాత ఉపగ్రహాలు అనుసంధానించి ఎఎస్ఎల్‌వి ప్రయోగం చేస్తే, రెండు సార్లూ ఆ రాకెట్‌లు నింగి కెగిరే శక్తిలేక, సముద్రంలో కుప్పకూలి పోయాయి. అందువల్ల ఉపగ్రహాలను పైకి పంపేందుకు మన మింత కాలం ఇటు రష్యా పైన, అటు యూరోపియన్ సమాఖ్య పైన ఆధారపడు తున్నాము. ఈ పరిస్థితులలో భారతదేశం రాకెట్ టెక్నాలజీ పొందడానికి లేదన్న పంతంలో అమెరికా మనపై ఆంక్షల విధించింది. రాకెట్ ఇంజన్‌ను సరఫరా చేయడానికి అంగీకరించిన రష్యా పై సైతం కన్నెర్ర చేసింది. రాకెట్ టెక్నాలజీ, యుద్ధంలో వాడే క్షిపణుల తయారీకి పనికి వస్తుందన్నదే అమెరికా భయం; భారతదేశం స్వతంత్రంగా రాకెట్‌లు ప్రయోగించే దశకు చేరుకుంటే, అంతర్జాతీయ రంగంలో తమ ఆధిపత్యానికి సవాల్ ఎదురౌతుందన్నది అమెరికా కుళ్లు. అందుకే ఆ ప్రయత్నాలకు గండి కొట్టనారంభించింది.

ఈ పరిస్థితులలో ఏ విదేశీ సహాయం లేకుండా ఉపగ్రహాలను రోదసికి చేర్చే రాకెట్ తయారీలో మన శాస్త్రవేత్తలు విజయం సాధించడం, నిజంగా జాతి గర్వించదగిన విషయం. ఇప్పుడు పంపింది, చిన్న ఉపగ్రహం మాత్రమే. ఇటువంటివే మరి రెండు, మూడు ప్రయోగాలు జరిపిన తర్వాత భారీ ఉపగ్రహాలను శ్రీహరికోట నుంచే ప్రయోగించవచ్చు. ఆ పిఎస్ఎల్‌వి రాకెట్‌ల అభివృద్ధికి మరొక మూడు, నాలుగేళ్ల పరిశోధన సరిపోతుందని శాస్త్రవేత్తలు విశ్వసిస్తున్నారు.

తన ఆర్థిక, ఆయుధ సంపత్తిని ఆసరాగా చేసుకొని, సోవియట్ రష్యా పతనాన్ని అలుసుగా తీసుకొని, వర్ధమాన దేశాల పై కర్రపెత్తనం చేయజూస్తున్నఅమెరికా ఆగడాలను ప్రతిఘటించడానికి పిఎస్ఎల్‌వి ప్రయోగం తప్పని సరి. ఈ విషయంలో భారతదేశం సంపూర్ణ విజయం సాధిస్తే, మొత్తం మూడవ ప్రపంచ దేశాలు సంతోషిస్తాయి. తమ తమ జాతుల స్వాభిమానాన్ని పదిలంగా పరిరక్షించు కోగల్గుతాయి. అమెరికా ఎన్ని బెదరింపులు చేసినా, డాలర్ల కొరత ఎదుర్కొంటున్న రష్యా వాటికి ఎంతగా తల ఒగ్గినా, మన సార్వభౌమాధికారానికి, సర్వస్వతంత్ర మనుగడకు విఘ్నం ఏర్పడదు.

అందువల్లే ఇప్పుడు మన రోదసీ శాస్త్రవేత్తల పై మన జాతిప్రతిష్ఠ ఒక్కటే కాకుండా మొత్తం ప్రపంచ గౌరవాభిమానాలు ఆధారపడి వున్నాయి; వారి పరిశోధనా ఫలితాలపై అసంఖ్యాక చిన్న దేశాల భవిష్యత్తు, మనుగడ ఆధారపడి వున్నాయి. అది మనసులో పెట్టుకొని శాస్త్రవేత్తలు మరింత దీక్షతో, మరింత పట్టుదలతో తమ మేధో సంపత్తిని వినియోగించి, సత్వరమే పిఎస్ఎల్‌వి రాకెట్ రూపకల్పన చేయాలి. ఏనాటికైనా అమెరికాకు ధీటుగా రోదసీ వాహనాల తయారీ, క్షిపణులు, అణ్వాయుధ వాహకాలను రూపొందించాలి. ఆ కృషిలో వారికి ప్రతి భారతీయ కుటుంబపు మద్దతు లభిస్తుంది.

ఇప్పటి ఎఎస్ఎల్‌వి విజయంతో, రాకెట్ ప్రయోగాలకు శ్రీ హరికోట పనికి రాదన్న ప్రచారానికి తెరపడుతుంది. భూమధ్య రేఖ సమీపాన వున్నందువల్ల భూమ్యాకర్షణ శక్తికి లోనై, రాకెట్‌లు పై కెగర లేకపోతున్నాయని కొందరు శాస్త్రవేత్తలు విశ్వసించారు; అది తప్పని తేలిపోయింది. నెల్లూరు జిల్లాకు సంబంధించి నంత వరకు ఇదీ ఒక శుభ పరిణామమే.

## జమీన్‌రైతు

22-5-1942

8 పేజీలు అణా

### కలెక్టరు ప్రకటన

మహమ్మదీయులును, హిందువులును చాలా మంది తమతను ఇండ్ల వద్దగాని, సమీపములోగాని, పోలీసు బందోబస్తు ఏర్పరచమని నన్ను కోరి యున్నారు. ఇటువంటి ప్రార్థనలన్నిటిని నెరవేర్చుట ముమ్మాటికి అసాధ్యము.

పౌరులకు నేను తిరుగా తెలియజేయుట ఏమనగా అచ్చటచ్చట జరుగు ఘాతుక చర్యలు పూర్తిగా నిలిచిపోవుటకు దౌర్జన్యముగా గాని ప్రతీకారముగా గాని యెడ తెగక కల హమును సాగించు దుండగీంద్రను యిరుమతములలోని పెద్దలు తగు కట్టు దిట్టములలో నుంచవలయును. ఉపదేశములకు లొంగనివారిపై జామీను చర్యలు తీసికొనుటకు పెద్దలు పోలీసువారికి తోడ్పడవలయును.

ఏ నాటికైనను యిరుమతముల వారికి యీవివాదము రాయబారము వలనను, రాజీవలననూ పరిష్కరింప బడవలసినదేగాని, యిట్టికొట్లాటలు రాజీ కుదరకుండ చేయుటతప్ప రాజీ స్వభావము నెమాత్రము మార్చజాలవనియు యిరు తెగలలోని వివేకవంతులు స్పష్టముగా గ్రహించినారనియు నా నమ్మకము.

జిల్లామేజిస్ట్రేటు

### ఈ వారం గలాటాలు

16-5-42 తేది పత్తి శ్రీరాములు శెట్టి మనుమడు రామయ్య, 10 తేది ఒక మహమ్మదీయుని జట్కా విషయంలో దౌర్జన్యం చేశాడనే నేరంమీద అతన్ని ఈ దినం ట్రంకురోడ్డులో అరెస్టు చేశారు. అప్పుడు సర్కిల్ గూడా ఉన్నాడనీ, సర్కిల్ కొట్టాడనీ, రామయ్యగారు దర్మిల్లా సబ్‌మేజిస్ట్రేట్ కోర్టులో

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

కేసుబెట్టాడనీ, అప్పుడు యీ దెబ్బలు సబ్‌మేజిస్ట్రేటు గారు చూచారనీ, బహాశా నోటు చేసివుంటారనీ, ఆకేసు డిప్టీమేజిస్ట్రేటు వద్దకు పంపినాడనీ తెలుస్తుంది. ఈ సందర్భంలో పెద్ద ఆసుపత్రివారు సర్టిఫికేటు ఇవ్వక పోగా ఫిర్యాది మద్రాసు పోయినాడని 10 తేది వార్త.

ఈ ఉదయం 9గం.లప్పుడు బెస్త వీధిలో కృష్ణయ్య యిండ్లు రెండు తగలబడగా ఆర్పిరి.

17-5-42 తేది ఉదయం 10 గం.లకు ట్రైకాసు రోడ్డు సారాయి అంగడి వద్ద ఒక హిందూ పిల్ల వాని చెయ్యి విరిచిరి.

ఈ సాయంత్రం హిందూ మహాసభ సభ్యుడు డి. వేణుగోపాలు గారిని అరెస్టు జేసిరి.

* * *

ఆంధ్రదినపత్రిక విలేఖరి కొట్రా ఆదిశేషయ్య గారు 19 తేది ఉదయం 8.30గం.ల ప్రాంతంలో భారత కేఫ్‌లో కాఫీ బల్లవద్ద వుండగా ఎవరో హిందువువచ్చి సర్కిల్ యిన్‌స్పెక్టరు పత్తి రామయ్యను కొట్టినవిషయం ఆంధ్రపత్రికకు వ్రాయలేదని అడిగినట్లున్నూ, ఆ విషయంలో ఘర్షణ వచ్చి ఆదిశేషయ్యను కుర్చీతో కొట్టబోయినట్లు, ఆదిశేషయ్యగారు పోలీసు రిపోర్టు చేశారు. పోలీసు టీకుటాకుతో వచ్చింది. ఆ కొట్టబోయిన వ్యక్తిని ఆదిశేషయ్య పోల్చలేదు. ఇక్కడ లేద న్నాడట. డి.ఎస్.పి. గూడా వచ్చారు. మనం చెప్పలేకపోతే, వ్యక్తిని చూపలేక పోతే పోలీస్ మాత్రం ఏం జేస్తుంది.

### తెనుగు పత్రికాధిపతికి శిక్ష

లక్నోలో ప్రకటింపబడు నేషనల్ హెరాల్డు పత్రికలో లక్నో జైలును గూర్చి వ్రాసిన వ్యాసానికై సంపాదకుడు కోటంరాజా రామారావు గారు (ఆంధ్రుడు) మీద లక్నో క్యాంపు జైలు సూపరెంటు మాననష్టపు దావా తేగా జర్థిగార సంపాదకునికి 6 మాసాలు విది ఖైదు, రు750 లు జుల్మానా విధించిరి. జుల్మానా ఫిర్యాదికిమ్మనట్లు తీర్పుజెప్పిరి.

# టౌన్ బస్ షెల్టర్లు కావాలి!

నెల్లూరు టౌన్‌లో ఏ టౌన్ బస్ స్టాపింగ్‌లోనూ సరైన షెల్టర్ లేదు. అయ్యప్పస్వామి దేవాలయం నుంచి నవాబుపేట వరకు వున్న దాదాపు పాతిక స్టాపలలో ముప్పాతిక భాగం రోడ్డు ప్రక్క బస్సులు నిలపడం తప్ప ప్రయాణీకులు నిలబడడానికి, కూర్చోవడానికి కనీస వసతి లేదు. ఎర్రటి ఎండలో నెత్తి మాడి పోతున్నా, జోరున కురిసే వర్షంలో వళ్లు తడిసి ముద్దవుతున్నా భరిస్తూ, సహిస్తూ బస్‌కోసం ఎదురు చూడాల్సిందే. విప్పో ఫ్యాక్టరీ, కొండాయపాళెం గేటు, మద్రాసు బస్టాండు, గాంధీ బొమ్మ, సుబేదారుపేట వంటి కూడలులలో ఏ సమయంలోచూసినా పాతిక ముప్పయ్ మందికి తక్కువ కాకుండా బస్ కోసం ఎదురు చూస్తూంటారు. వారందరి పరిస్థితి దయనీయం. ఎండకు తట్టుకోలేక కొందరు స్త్రీలు, వృద్ధులు పడే బాధ వర్ణనాతీతం. ఐదేళ్లపాటు అధికారంలో వుండిన నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ కనీసం ఒక్క బస్ షెల్టర్ అయినా కట్టించ లేకపోయింది. కాంట్రాక్టులు పంచుకోవడానికి, కమీషన్లు దండుకోవడానికె వారికి సమయం చాలలేదు. కనీసం కలెక్టర్ గారైనా, వదాన్యుల సహకారంతో, మునిసిపల్ నిధులు కలిపి అన్ని ప్రధాన కూడళ్లలోనూ ప్రయాణీకులకు తలదాచు కొను నీడ నిచ్చే బస్ షెల్టర్లు కట్టించ గల్గితే, ప్రజలు చేతులెత్తి దండం పెడతారు.

— ఆర్. సుహాసిని

నెల్లూరు

### జనవాణి

### రియల్ ఎస్టేట్ల మోసం ఎవరు ఆపాలి?

రియల్ ఎస్టేట్ కంపెనీలు, ఫైనాన్స్ కంపెనీలు, చిట్ల కంపెనీలు, ఎవరి శక్తికి తగ్గట్టు వారు, ఎవరిష్టం వచ్చినట్లు వారు, ఎవరి తెలివికి తగ్గట్టు వారు ప్రజలను అమాయకులను చేసి, దద్దమ్మలుగా భావించి ధనార్జన చేసుకుంటూ పోతున్నారు. ఈ విషయాలపై తరచూ మీ పత్రికలో వస్తున్న వార్తలు, వ్యాఖ్యలు సమంజసమే.

కాని, వీరి మోసాలను, వీరి దోపిడీలను ఎవరు ఆపాలి? ఇప్పుడొచ్చే రియల్ ఎస్టేట్ కంపెనీలు, ఏవీ పొలం కొని, స్థలాలు గుర్తుపెట్టి, టౌన్ ప్లానింగ్ వంటి పర్మిషన్లు తెచ్చి, రోడ్లు లైట్ల వంటి సౌకర్యాలు కల్పించి స్థలాలు అమ్మడం లేదు అందమైన

కొరవ 8 పేజిలో




ఏనుగ సీతారామరెడ్డి గారి వ్యాపార విజయోత్సవ వేదిక పై ఆసీనులై వున్నదేశంలోని రసాయన పరిశ్రమ పెద్దలు, విదేశీయులు; మైకు కు ముందున్నది ఇవిరెడ్డి

# నేత్రపర్వంగా జరిగిన 'మైకా' రజతోత్సవం

'సిరి' గిరి శిఖరారోహణ చేసినా సౌమ్యత, వినయం వదలని మిత్రుడు, నెల్లూరీయుడు శ్రీ ఏనుగ సీతారామ రెడ్డి వ్యాపార విజయోత్సవం గత నెల 29 తేది మద్రాసు రాజా ముత్తయ్య హాలులో కన్నుల పండువగా జరిగింది. పాతికేళ్ళ క్రితం, మద్రాసు మహానగరం లోని మారుమూల గదిలో అనామకంగా ప్రారంభమైన ఆయన సంస్థ – మద్రాస్ ఇండస్ట్రియల్ కెమికల్ ఏజన్సీస్ (మైకా) ఈనాడు అదే మద్రాసు నగరంలో ముఖ్యమైన రసాయన విక్రయశాలగా మారింది. వ్యాపారంతో పాటు సీతారామరెడ్డి మద్రాసు తెలుగు వారిలో ప్రధానుడుగా ఎదిగారు. ప్రవాసాంధ్రులలో ఆయన కున్న ప్రాచుర్యం, స్నేహ సంపదలకు

**రెండు వ్యాపార విజయోత్సవాలు**

నిదర్శనమా అన్నట్లు జరిగింది – ఈ వ్యాపార విజయోత్సవం! వచ్చిన జనంతో అంత హాలూ చిన్నదైపోయింది. జనం ప్రవాహం లాగా తరలి వచ్చారు. వేదికపై వున్న ముఖ్యులను చూస్తే - రసాయన పరిశ్రమల రంగంలోని పెద్ద తలలంతా తరలి వచ్చినట్లే వుండింది.

సీతారామ రెడ్డి గారి పట్లవున్న స్నేహభావంతో కాబోలు, విప్రో అధినేత శ్రీ వి. ఓబులు రెడ్డి హాలంతా తానై తిరుగుతూ, అందరినీ పలుకరిస్తూ, హుషారు పరుస్తూ కన్పించారు. మాగుంట శ్రీనివాసులరెడ్డి వంటి మద్రాసు తెలుగు ముఖ్యులంతా విచ్చేశారు. దేశ ఖ్యాతి పొందిన కలర్ కెమ్, హిక్సన్ దాదాజీ, అల్బ్రైట్‌విల్సన్,

కొరవ 7 పేజీలో

# కాపురుష్ – మహా పురుష్

పాత మణి టాకీస్, ఇప్పటి విజయలక్ష్మి థియేటర్ మాబోటి వారిస్తపు సినీ ప్రేక్షకులకు యిటీవల కొంతకాలం నుండి స్వర్గతుల్యంగా, స్వప్న మందిరంగా కనపడుతున్నది. ఆ థియేటర్లో యిప్పుడు భారతీయ మేలి చిత్రాలనే వాట్ని వరసగా ప్రదర్శింప జేయాలనే దీక్ష కనపడుతున్నది.

ఆ మధ్య మలయాళీ చిత్రం 'చెమ్మీన్' ను ప్రదర్శించారు. మొన్న ఆదివారం సత్యజిత్ రే గారి 'కాపురుష్ - మహాపురుష్' అనే చిత్రాన్ని ప్రదర్శించారు. - పాత కొత్త సంవత్సరాల మేలు కలయికగా డిసంబరు 31, జనవరి 1తేదుల్లో వుదయంపూట ఆటలుగా, ! రేపు ఆదివారం 7తేది రుత్విక్ ఘటక్ గారి దర్శకత్వంలో వెలువడిన మరో గొప్ప బెంగాలీ చిత్రం. 'సువర్ణరేఖ' ను ప్రదర్శిస్తున్నారు.

ఈ 'కాపురుష్- మహాపురుష్' పేరుకు వొకే సినిమాగా కనపడుతున్నా

**పాత సంచికల్లో సత్యజిత్‌రే చిత్రసమీక్షలు.**

వినబడుతున్నా, అది నిజానికి రెండు చిన్న సినిమా ఖండ కావ్యాలను అందంగా ఏకీకరణ చేసినట్లున్నది. ఈ రెండు సినిమా తునకలను కలిపి తల్లక్రిందులుగా పేరు పెట్టడంలోనే సత్యజిత్ రే గారి సృజన రంజకమైన 'సెటైర్' ధోరణి వ్యక్తమవుతుంది. సత్యజిత్‌రే గారి కళా ప్రతిభకు రెండు చేతులెత్తి దణ్ణం పెట్టాలనిపిస్తుంది.

డేవిడ్ సార్నఫ్ అనే ఆయన ఒక భారతీయుణ్ణిదిగాదట- రే 'తీనకన్య' 'ఇద్దరు కుమార్తెలు' - అనేది చూసిన తర్వాత - " Do you know the Content of Ray's genius ?" దీనికి అతనే సమాధానం చెప్పారు; " I will tell you what it is. He is an Indian, intensely Indian.

ఆర్.ఆర్. మిార్జా అనే మరో సినీ వ్యాఖ్యాత అంటాడు చూడండి: In the short period of his career, in a rather poor misunder stood country he has shown India to Indians in a Language that transcends the narrow shuttered confineess of linguism and semantics and told foreigners of the beauty and sweetness of his land without recoures to boasting. Ray's cinema seems to possess some other quality than mere genius, an elusive, fugitive thing which gives his statemens a validity beyond technique.- రే గారు తీసిన వొక్కొక్క సినిమా చూస్తున్న కొద్దీ

కొరవ 11 పేజీలో

## వార్తలు ముగించే ముందు విశేషాలు మరో 'శారి'

ఈ నెల 27, 28 తేదీలలో నెల్లూరు నందు లేడీస్ క్లబ్‌లో మహిళల కొరకు ప్రత్యేకంగా పలురకాల చీరలు ప్రదర్శించ బడుతాయని 'లేపాల' వారు ఒక ప్రకటనలో తెలియజేశారు. "సందర్శన జనాలు రద్దీ – ప్రదర్శన రోజులు కొద్దీ" కనుక ఉ. 10 నుండి సా. 7 వరకు అమ్మకాల సమయాన్ని ఇంటర్‌వెల్ లేకుండా సాగిస్తున్నట్లు కూడా వారు తెలియజేశారు. 27, 28 తేదీల్లో "ఇంతులకు మంచి ప్రాప్తం" "ఇంతటితో ఈ వార్తలు సమాప్తం".

# సణుగుడు

* సతీమణి స్మృతి పై సైతం వ్యాపారం చేయాలా?
* ఆనం వివేకానందరెడ్డి సైన్స్ ఎగ్జిబిషన్

ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.రామారావు తన సామ్రాట్ అశోక చిత్రంపై వచ్చే ఆదాయాన్ని తన సతీమణి పేర ఏర్పరచబోయే స్త్రీ_శిశు సంక్షేమ సేవా సంస్థల నిర్వహణకు వాడతారట; పత్రికల వారికి చెప్పారు. ఎన్.టి.ఆర్. అబద్ధాలు అందంగా చెప్పగలడని లోకానికంతా తెలుసు కాని, మరీ ఇంత దిగజారి పోయి అసత్య వ్రత మాచ రిస్తాడని నామటుకు నేను భావించలేదు. మూడేళ్ళ క్రితం విశ్వామిత్ర విడుదల సందర్భంలోను ఆయన ఇదే ప్రచారం చేసుకున్నారు. అప్పుడాయన చెప్పిన అందమైన ఆ అబద్ధం - బసవతారకం క్యాన్సర్ ఆస్పత్రి. ఆ సినిమా విడుదలైంది; ముఖ్యమంత్రిగా వుండి దబాయించి నిర్ణయించిన రేట్లకు అమ్ముడు బోయింది; కోట్లు చేతికందాయి; క్యాన్సర్ ఆస్పత్రి మాత్రం ఆ ధనరాశుల క్రింద పడి నలిగిపోయింది. ఇప్పుడు కొత్తగా స్త్రీ_శిశు సంక్షేమ పథకం కథలు చెప్తున్నారు.

ఎన్.టి.ఆర్.కు డబ్బంటే అపరిమితమైన ప్రీతి. సినిమాలలో వున్నప్పుడు ఆయన నటనా ప్రతిభ గురించి ఎంత గొప్పగా మాట్లాడుకునే వారో , మాటింగ్ స్పాట్‌నుంచి టవళ్ళు, అట్ట కిరీటాలు, గుడ్డలు, గిద్దలు ఎత్తుకపోయే లక్షణం గురించి అంతే తేలికగా మాట్లాడుకునే వారు రాజకీయాల లోకి వచ్చినా, సన్యాసం స్వీకరించినట్లు డబ్బా వాయించుకున్నా ఆ బుద్ధి మాత్రం మారలేదు. మహానాడులు పెట్టి కిచైనులు అన్నం పొట్లాలు అమ్మించే వాడాయన. అయితే డబ్బుమీద మమకారం, సతీమణి స్మృతిపై సైతం వ్యాపారం చేయించే దిగజారుడుకు ఆయన్ను పతనం చేయించడమే బాధాకరమైన విషయం. వ్యక్తిగత విషయాలు ప్రస్తావించడం ధర్మంకాదు కాని, ఎన్.టి.ఆర్. వంటి అహంభావి, నియంతృత్వ స్వభావితో అన్నేళ్ళు కాపురం చేసి, అంతమంది సంతానానికి తల్లి అయిన ఆ మహాతల్లి సహనం, త్యాగం ఎంతటిదో ఎవరైనా

**డోలేంద్ర**

వూహించుకోవచ్చు. అన్నేళ్ళు సహధర్మచారిణిగా వుండిన వ్యక్తి చావు బ్రతుకుల్లో ఆస్పత్రిలో పడి వుంటే, వదిలేసి, వూడిపోయిన ముఖ్యమంత్రిత్వం కోసం ఢిల్లీకి పరుగులు పెట్టిన వాడు రామారావుగారు. అదే పని ఒక స్త్రీ చేసి వుంటే, లోకులు కాకులై ఎంత కుళ్ళబొడిచి వుండేవారో చెప్పబని లేదు. సతీమణి చావుకంటే, పదవి కోసం ప్రాకులాట మిన్నగా భావించే వ్యక్తి తన సతీమణి పేరిట సేవా కార్యక్రమాల కోసం కోట్లు ఖర్చు పెడతాడని పిచ్చి వాళ్ళుకూడా నమ్మరు.

కొరవ 8 పేజీలో

# తడ స్మగ్లింగ్ శృతి మించుతూంది!

మద్రాసుకు బియ్యం, సారాయి స్మగ్లింగ్ చేసేవారికి తడ చెక్ పోస్టు స్వర్గధామంగా తయారైనట్లుంది. టాక్ పాక్ లారీలకు, సారాయి పీపాలున్న కార్లకు ఆ చెక్ పోస్టులో రాచమర్యాదలు జరుగుతున్నాయి. మద్రాసుకు బియ్యం, సారాయి స్మగ్లింగ్ దశాబ్దాల కాలం నుంచి జరుగుతున్నా, ఇప్పటి వలె శృతిమించిన పరిస్థితి ఇంతకు ముందెప్పుడూ వున్నట్లులేదు. పట్టపగలే, పెరవాగా చెక్‌పోస్టు సిబ్బందికి మామూళ్లు చెల్లించి, పరుసబెట్టి పరుగులు పెడుతున్నాయి – స్మగ్లింగ్ లారీలు. అడిగే వారు లేరు, ఆపేవారు లేరు. అధికార్ల ఇష్టారాజ్యం. వారికిమామూళ్ల ఆదాయమే రోజుకు లక్ష దాటుతున్నదని అంచనా. చెక్‌పోస్టులో పోస్టింగ్ ఇప్పించగల్గితే బ్రేక్ ఇన్స్‌పెక్టర్, కమర్షియల్ ట్యాక్సెస్ అధికారులు రెండున్నర లక్షలిస్తామని తిరుగుతున్నారట. దాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు – ఆ చెక్ పోస్టులో జరిగే గోల్మాల్ ఎంత తీవ్రస్థాయిలో వుందో!

ఎంత వరకు నిజమో కాని, ఈ చెక్ పోస్టు స్మగ్లింగుకు అధికారులతో

## జిల్లావార్తలు

పాటు కొందరు రాజకీయ వాదులకూ సంబంధముందని చెప్తున్నారు. వ్యక్తుల పేర్లు చాలా ఫ్రీగా ప్రచారంలోకి వస్తున్నాయి. ఈ స్మగ్లింగ్‌ను ఇంత స్వేచ్ఛగా జరగనివ్వడం ప్రభుత్వానికి ప్రతిష్ట కాదు; తక్షణం కఠినమైన చర్యల ద్వారా స్మగ్లింగ్‌ను నిరోధించాలి. నిజాయితీ పరులైన అధికారులను నియమించి అన్ని దార్లూ మూసి వేసి, ప్రజలకు ప్రభుత్వం ఒకటుందన్న విశ్వాసం కల్గించాలి!

బియ్యం స్మగ్లర్ల చేతిలో తమ శాఖలకు చెందిన ఒక సబిన్స్‌పెక్టర్ దారుణంగా హతమైన తర్వాత కూడా స్మగ్లర్లకు చేయూతనిస్తున్న పోలీసు శాఖను ఏమి చేయాలి? వారిని మనుషులుగా భావించడమే నేరమౌతుందేమో? ఛీ! ఛీ!

### కావలి మేజిస్ట్రేట్ బదలి

ఆర్‌టిసి పోర్టరు దౌర్జన్యం పై ఆరోపణకు గురైన కావలి మెజిస్ట్రేట్ శ్రీ నాగేశ్వర రావును సత్తెనపల్లెకు బదలీ చేశారు. ఆయనపై దాఖలు చేసిన ప్రైవేటు కేసు మాత్రం 29 తేది విచారణకు వస్తున్నది.

న్యాయాధికారులు వ్యక్తిగత అధికారాల చలాయింపుకు పాల్పడి, వివాదాస్పదులు కావడం విచారకరం!

### షాదిమంజిల్ పునరుజ్జీవనం

నిధుల కొరత వల్ల అర్థాంతరంగా నిల్చిపోయిన కావలి షాదిమంజిల్ నిర్మాణం పూర్తి చేయడానికి జామ్మామసీదు కమిటీ ముందుకు వచ్చింది. ఐదేళ్లక్రితం గ్రామీణ క్రాంతి పథం క్రింద దీన్ని ప్రారంభించారు. నిధులు చాలక మధ్యలో నిల్చిపోయింది. 15 తేది జరిగిన ఒక చిన్న సభలో కలెక్టర్ శ్రీ ఆ రాజా భవన నిర్మాణానికి ప్రభుత్వ అనుమతిని, మసీదు కమిటీకి అందజేశారు. సభలో ఎమ్మెల్యే శ్రీ యానాదిరెడ్డి, ఆర్‌డిఒ శ్రీ జీవిరి

కొరప 7 పేజీలో



మద్రాసు 'మైకా' సంస్థ ... డాక్టర్ ... గోపాలరెడ్డిని సన్మానిస్తున్న నిప్పో ఒబులరెడ్డి; ప్రక్కనే పెనుగ సీతారామరెడ్డి



## శ్రద్ధాంజలి.....

మా అభివృద్ధి కారకులు, మా తండ్రి

## పమిడి తిరుపతి రావు గారు

రిటైర్డ్ డి.ఎస్.పి.



11.5.92 తేది సోమవారం స్వర్గస్తులైనారు. వారి ఆత్మకు దైవసాన్నిధ్యంలో చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ, శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**పెద్దకర్మ 27.5.92 తేది బుధవారం**

నెల్లూరు మూలపేట జడ్జిబంగళాకాలనీ డోర్ 24/559/49A లోని మా వసతి గృహమునందు జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

పి. సుధాకర రావు, పి. మధుసూదన రావు, డా. పి. చంద్రశేఖర్MD, డా. పి. శ్రీధర్MD, పి. రఘురామారావు B.Tech

L. విజయలక్ష్మి – వెంకటేశ్వర్లు: కుమార్తె – అల్లుడు
పి.లత, పి. సుగుణ, పి. కల్పన, పి. చంద్రలత: కోడళ్లు
మరియు
మనుమళ్ళు, మనుమరాళ్ళు

# నెల్లూరు నలుచెరగుల్లో

### విమర్శకుడు

## ముఖ్యమంత్రి పర్యటన

ముఖ్యమంత్రి శ్రీఎన్ జనార్థన రెడ్డి 4 తేది నెల్లూరు వస్తున్నారు. రాష్ట్రప్రభుత్వ నంది అవార్డుల ప్రదానోత్సవం, ఆ సాయంత్రం ఏసిస్టేడియంలో అట్టహాసంగా జరుగబోతుంది. తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీమతి జయలలిత కూడా రావచ్చుని వార్త.

జనార్ధనరెడ్డి గారు 5 తేది వెంకటగిరి, వాకాడు ప్రాంతాలలో పర్యటిస్తారు. అధికారికంగా కార్యక్రమం ఇంకా ఖరారు కాలేదు.

## ఎండలు

ఎండలు మండిపోతున్నాయి. పగటి పూట తల బయట పెడితే కొలిమిలో వున్నట్లుంది ; ఇంట్లో వుంటె పెనం మీద వేగుతున్న ఫీలింగ్ కల్గుతున్నది. ఎండ సెగకు తోడు కరెంట్ కోత. నరక లోకాన్ని ఇలలోనే చూపిస్తున్నారు విద్యుత్ శాఖీయులు. ఈ వారం నెల్లూరులో రికార్డయిన గరిష్ట ఉష్ణోగ్రత వివరాలివి.

| తేది | ఫారెన్‌హీట్ డిగ్రీలు |
|---|---|
| 16 | 100.7 |
| 17 | 102.9 |
| 18 | 106.1 |
| 19 | 104.5 |
| 20 | 104.5 |
| 21 | 106.5 |
| 22 | 110.3 |

ఇటీవలి సంవత్సరాలలో 110 డిగ్రీల ఉష్ణోగ్రత రాలేదు!

## పెళ్ళకూరుకు ప్రధాని పరామర్శ

మద్రాసు సిఎంఆ రెడ్డి ఆస్పత్రిలో విశ్రాంతి తీసుకుంటున్న శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డిని ప్రధాని శ్రీ పివి నరసింహారావు పరామర్శించి వెళ్ళారు. 21 తేది ఉదయం శ్రీపెరంబుదూరులో రాజీవ్‌కు శ్రద్ధాంజలి ఘటించడానికి విచ్చేసిన ప్రధాని, ఆ కొద్ది సమయంలోనే తీరిక చూసుకొని, ఆస్పత్రికి వచ్చి, పాత స్నేహితుగిని పలకరించి వెళ్ళారు. ఆస్పత్రిలో పది నిమిషాలు గడిపారట. కేంద్రమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి కూడా ప్రధానితో వచ్చారు.

వెళ్ళేముందు పెళ్ళకూరు చెవిలో ఏదో వూది వెళ్ళారట పివి; ఆ తారక మంత్రం ఏమైవుంటుందో మరి?

## 10 వ తరగతి ఫలితాలు

10 తరగతి పరీక్షా ఫలితాలు దిగువ యిస్తున్నాము. బ్రాకెట్లలోనివి ఫస్ట్‌క్లాసులు

| | పరీక్షకు హాజరైన వారు | పాసైన వారు | శాతం |
|---|---|---|---|
| **నెల్లూరు** | | | |
| బాలాజీ | 10 | 10(7) | 100 |
| స్వామిదాస్ | 119 | 119(108) | 100 |
| విశ్వభారతి | 18 | 17(17) | 95 |
| వేదసంస్కృత | 31 | 28(12) | 90 |
| గరల్స్ హైస్కూల్ | 116 | 59(26) | 50 |
| ఎ.బి.యం. | 131 | 38(14) | 38 |
| వి.ఆర్.సి. | 216 | 82(42) | 38 |
| ఆర్.యస్.ఆర్ | 203 | 57(22) | 25 |
| **కావలి** | | | |
| నరేంద్రభారతి | 21 | 21(14) | 100 |
| విశ్వోదయ (బాలికలు) | 138 | 79(43) | 57 |
| విశ్వోదయ (బాలుర) | 176 | 95(45) | 54 |
| 8 వ వార్డు | 48 | 22(6) | 44 |
| జి.ప్ర | 210 | 41 | 20 |
| **ఇతర స్కూళ్లు** | | | |
| ఇస్కపల్లి | 21 | 21(10) | 100 |
| కొండాపురం | 100 | 88(11) | 88 |
| కోవూరు ప్రశాంతి | 23 | 16(3) | 76 |
| గండిపాళెం | 33 | 24(1) | 73 |
| కలిచేడు | 51 | 31(2) | 61 |
| కోవూరు వివేకానంద | 40 | 24(8) | 60 |
| పెదపుత్రేడు | 51 | 28(3) | 55 |
| వింజమూరు | 133 | 62(7) | 47 |
| చాకల కొండ | 29 | 13(2) | 45 |
| బ్రాహ్మణక్రాక | 42 | 10 | 24 |
| గొరవరం | 22 | 3 | 14 |
| సర్వాయపాళెం | 18 | 2(1) | 12 |

21 తేది ఉదయం విఆర్ హైస్కూలులో సైన్స్ ఎగ్జిబిషన్ ప్రారంభిస్తున్న కలెక్టర్ కె. రాజా, నిర్వాహకుడు ఆనం వివేకానంద రెడ్డి; ప్రదర్శనను తిలకిస్తున్న ఎమ్మెల్యే జకారెడ్డి, ఎమ్పీ కె.పద్మశ్రీ, ఆనం సంజీవ రెడ్డి, ఆనం రామనారయణ రెడ్డి.

## ఇందుకూరు పేట
## యువతి దారుణ హత్య

ఇందుకూరు పేటలో 13 తేది ఉదయం పముజాల తిరుమల అనే పదిహేడేళ్ళ యువతిని పరమ కిరాతకంగా గొంతునులిమి చంపినట్లు తెలిసింది. పోలీసు రికార్డుల కెక్కని దారుణ హత్యోదంతం ఇది.

తిరుమలకు, ప్రక్క ఇంటిలోని ఒక యువకుడితో అక్రమ సంబంధం వుండేదట. అది గర్భధారణ వరకు వచ్చినట్లుంది. ఆ యువకుడు వివాహితుడు. అయినా ఈమె మీద మమకారంతో రెండవ పెళ్ళి చేసుకుం టానని చెప్పేడట. ఇది అతని భార్యకు కష్టకారణ మైంది. ఆ కోపంతో ఆమె, తిరుమల ఇంట్లో ఒంటరిగా వున్న సమయం కనిపెట్టి, 13 తేది ఉదయం 10 గంటలప్పుడు మరిద్దరిని తోడు తీసుకుని గొంతునులిమి చంపేసిందట. అది బయట పడకుండా వుండడం కోసం, చచ్చిన శవం మెడకు ఒక పంచ కట్టి, కప్పుకున్న కొక్కికి వ్రేలాడదీశారట. ఆ సమయంలో తిరుమల తల్లి దండ్రులు కూలి పనికి వెళి వుండివారట. వారు వచ్చేటప్పటికి శవం మాత్రం కన్పించింది. పోలీసు రిపోర్టు చేస్తే తమ ప్రాణాలకూ ముప్పు వస్తుందన్న భయంతో వారు దహన క్రియలు జరిపించేశారట.

దారుణమైన హత్య ఇది. అక్రమ సంబంధానికి పరిష్కారం చంపడమా ? పోలీసు స్టేషన్ కు వంద గజాల దూరంలో ఇంత ఘోరం జరిగితే పోలీసు ఎందుకు చర్య తీసుకోలేదు?

కొరవ 7 పేజిలో

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

కేసు కప్పి పెట్టడానికి వారెందుకు ప్రయత్నిస్తున్నారు? ఎస్ పి గారైనా జోక్యం చేసుకుని తక్షణం ఈ సంఘటనపై దర్యాప్తు జరిపించడం బాగుంటుంది!

### నెల్లూరు బజారు

మొలగొలుకు

| | |
|---|---|
| 9672 | 2900/- |
| 9674 | 3100/- |
| ఐ.ఆర్ 20 | 2400/- |

## జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

గాంధీ, ఎలక్ట్రికల్ ఇంజనీరు శ్రీ షేక్ మస్తాన్ వలి, మాజీ కౌన్సిలర్ శ్రీ బాల్వి, డాక్టర్ షరీఫ్ అహమ్మద్, మస్తాన్ సాహెబ్, ఖాదర్ మస్తాన్ తదితరులు మాట్లాడారు. శ్రీ అలీ జనాబ్ పఠాన్ మహబూబ్ ఖాన్ సభకు అధ్యక్షత వహించారు. మంజిల్ నిర్మాణానికి అనుమతి మంజూరు చేసిన ముఖ్యమంత్రికి ముస్లిం వక్తలందరూ కృతజ్ఞతలు చెప్పారు.

## మైకా

(4 పేజీ తరువాయి)

శంకర నేత్రాలయ, ఏసియన్ పెయింట్స్, వై అచ్చి వంటి కంపెనీల ఛైర్మన్లు, జనరల్ మేనేజర్లు హాజరైనారు. ఉపన్యాసాలు, గీపన్యాసాలు లేవు. హార్దికమైన పలకరింపులు, శుభాకాంక్షలు మాత్రమే. బెజవాడ గోపాలరెడ్డి గారిని సంస్థ తరపున శ్రీ ఒబులు రెడ్డి సన్మానించారు. పలు సంస్థలు, వ్యక్తులు సీతారామ రెడ్డిని సన్మానించారు. విందు. అంతే కార్యక్రమం.

## అపోలో వార్షికోత్సవం

ఈ వారంలో జరిగిన మరొక వ్యాపార విజయోత్సవం అపోలో ఆస్పత్రి తొలివార్షికోత్సవం. అపోలో ఆస్పత్రుల సామ్రాట్ డాక్టర్ పి.సి.రెడ్డి గారే విచ్చేశారు. హార్దికమైన చిన్న సభ.-

అపోలో ద్వారా నగరాలకే కాకుండా నెల్లూరు వంటి ద్వితీయ శ్రేణి పట్టణాలలోనూ కార్పొరేట్ వైద్య సేవలందించే ఉద్దేశ్యంతో మొదటగా నెల్లూరులో అపోలో ప్రారంభించామని ఈ ప్రయోగం తమకు సంతృప్తి ఇస్తున్నదని చెప్పారాయన. ఇక్కడ సిటిస్కాన్ వంటి అధునిక పరికరాలు పెట్టి, నూరు పడకల స్థాయికి పెంచేందుకు ప్రయత్నిస్తున్నా మన్నారు.

ఆస్పత్రి మేనేజింగ్ డైరక్టర్ డాక్టర్ గోపాలరెడ్డి త్వరలో మరొక 24 పడకలు ఏర్పాటుచేయ బోతున్నట్లు చెప్పారు ఈ ఏడాది కాలంలో 27 వేల మందికి చికిత్స చేశామని, అందులో గుండె జబ్బుల రోగులే 11 వందల మంది వున్నారని చెప్పారు. పేదల సౌకర్యం కోసం జనరల్ వార్డు ఛార్జిని 15 రూపాయలకే పరిమితం చేశామని తెల్పారు.





21 తేది ఉదయం మద్రాసు ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న పెళ్లకూరు రామచంద్రారెడ్డిని పరామర్శిస్తున్న ప్రధాని పి.వి. నరసింహారావు.







## శ్రద్ధాంజలి



### చేవూరు చంద్రారెడ్డి

(సోమవారప్పాడు)

18.5.1992 తేది సోమవారం స్వర్గస్థులైనారు.

వారి పవిత్రాత్మకు శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**వారి పెద్దకర్మ**

28.5.1992 తేది గురువారం

నెల్లూరు శ్రీనివాస అగ్రహారంలో జరుగును. కాన తెలుపడమైనది.

చేవూరు అన్నపూర్ణమ్మ (భార్య), చేవూరు రమణారెడ్డి (పినతండ్రి)

| కుమారుడు | కుమార్తె – అల్లుడు | బావమరదులు |
|---|---|---|
| చేవూరు మధుసూదన రెడ్డి | బుర్రా సుధీర<br>బుర్లా శివకుమార్‌రెడ్డి | బుర్లా గోపాల్‌రెడ్డి<br>నాగార్జునరెడ్డి<br>గిరిధర్‌రెడ్డి |

# శివారెడ్డి పద్యాలు

### ఇండియా ప్రధాని

ఇండియా ప్రధాని వీవుగావాలంటె
కావిదేంది ముష్టి దావిదేంది
కాకి హోష వాకటె దీకాకు వీకొద్దు
షైమినిష్టరు పివ్వు పాతుపిత!

చేతనైన హెల్పు జేస్తూనేవున్నారు
ఆంధ్రరాష్ట్రమునకు అంతె జాలు,
వల్లు కాల్చుకుంటె వచ్చేది ఏముందు
చీఫ్ మినిష్టు! యిదొక చిన్న సలహా!

ఆంధ్రవీ ప్రతిష్ట ఆకాశమంటింది
నీవె ముఖ్యమంత్రి నేద్రుమల్లి
ఇంతకంటె భాగ్యమేముంది?ఏదుంది?
ఎక్కడుంది ? తృప్తి ఎంత వరకు?

తప్పు లేకపోతె ఈ ఆంధ్రరాష్ట్రములో
కాంగిరేసు యింత కాలముందు
విజయం బయటపెడితె విస్ఫూరమొస్తుంది
దేవికంట! ప్రతిది దెలుసు తమకు!

### రంభ

వయసు కొన్ని ప్రొద్దువాటాలపోతుంది
ఆక్కడుంది చేసేదేమీ లేదు
కవికి నాకు దెయిలి కల్లో కనిపిస్తుంది
వేశ్యకాంత, రంభ వెళ్ళి వస్త!

నాకమిక్క దుంద నా పల్ల పీవొర్డి,
రాను పోను కవికి రైలు చార్జీ
పదవిపోతుంటె నడిదార్లో బడిపోయి
దిక్కు మొక్కు ఎవరు? చిక్కు ప్రశ్న?

## సణుగుడు

4 పేజీ తరువ

ఎన్.టి.ఆర్. తన సినిమాను ఎంతకైనా అమ్ముకోవచ్చు; ఏమైనా చేసుకోవచ్చు కాని, దానికి సంతాపపు సెంట్ పూసి, స్మృతి రంగులద్ది, శ్రద్ధాంజలి డైలాగులతో బజారులో విక్రయానికి పెట్టడం మాత్రం ఘోరం. ప్రజా జీవితంలో వుండే నాయకులు డబ్బు కోసం ఇంత పచ్చి అబద్దాలు చెప్పడం భావ్యంకాదు. అది ప్రజలను వంచించడం క్రిందకే వస్తుంది.

ఆనం వివేకానందరెడ్డి సైన్సు ఎగ్జిబిషన్, నిర్వహించడం

* * *

శ్రీ ఆనం వివేకానంద రెడ్డి నిర్వహించిన సైన్స్ ఫెయిర్ గ్రాండ్ సక్సెస్ అయింది. ఎండాకాలం సెలవల్లో, తుపాకీ శబ్దం విన్న పిట్టల్లాగా పిల్లలందరూ తలొక దిక్కుకు వెళ్లి పోయివున్న తరుణంలో, మూసి వేసిన స్కూళ్లు తెరిపించి, సైన్సు ప్రదర్శన నిర్వహించడం సామాన్యమైన విషయం కాదు. రాజీవ్ గాంధీ స్మృతికి అన్నదానాలు, ఫలపుష్ప పంపకాల వంటి మొక్కుబడి పనులుకాక, సమయోచితమైన కార్యక్రమం నిర్వహించాలనే పట్టుదలతో వివేకానందరెడ్డి ఈ ఫెయిర్ నిర్వహించి నట్లున్నారు. ఊర్లకు వెళ్లిన పిల్లల్ని, దుమ్ముపట్టిపోయిన పరికరాలను వెతికి తెచ్చి పెట్టడమే పెద్ద పనైనట్లుంది. భారీ ఎత్తున, భారీ ప్రచారంతో ప్రదర్శన జరగడం వల్ల, ఇతర రాజీవ్ స్మారక కార్యక్రమాలన్నీ దీని ముందు వెలవెల పోయాయి. దాదాపు 20 వేల మంది సింహపురీయులు ప్రదర్శన తిలకించారు. ఎర్రటి ఎండలో కూడా వి.ఆర్ హైస్కూలు కిటకిటలాడింది

రాజకీయ వాదులకు ఇటువంటి మంచిబుద్ధి పుట్టడమే అరుదైన విషయం. అందులోనూ, ఏ పదవి లేని యువరాజకీయ వాది అంత శ్రమ తీసుకోవడం ఇంకా ఆశ్చర్యకరం. వివేకానంద రెడ్డిలో మంచి ఆర్గనైజింగ్ సామర్థ్యం వుంది; కష్టపడి పనిచేసే ఓపికా వుంది; కాని అదృష్టమే కలిసి రావటంలేదు.

ప్రదర్శనలో దాదాపు 100 పరికరాలు పెట్టారు. హ్యాండ్ గ్రైండర్స్, రాకెట్ మోడల్, మిల్లింగ్ మ్యాన్, ఎలక్ట్రానిక్ ఫౌంటెన్ వంటి అంశాలు బాగా ఆకర్షించాయి. రాజీవ్ ఊహాలోకంలో భారతదేశం అన్న అంశంపై చిత్ర లేఖన పోటీ పెట్టారు. దాదాపు 100 మంది అందులో పాల్గొన్నారు. సభలు షరా మామూలే! దీనికి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి, కలెక్టర్ శ్రీ కె.రాజా, ఎమ్మెల్యే శ్రీ జె.కె.రెడ్డి, ఎమ్పీ కుమారి కె.పద్మశ్రీ, ఆనం రామనారాయణ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

సైన్సు పట్ల, సైన్సు అభివృద్ధి పట్ల ప్రజలలో ఆసక్తి అభిరుచి పెరిగితేనే ఏ సమాజమైనా అభివృద్ధి చెందుతుంది. వివేకానంద రెడ్డి వంటి యువరాజకీయ నేతలు రాజీవ్ వర్ధంతి వంటి సందర్భాలను ఇటువంటి నిర్మాణాత్మక కార్యక్రమాలకు వినియోగిస్తే నాయకులకు సముచిత స్మృతి చేసినట్లుంటుంది; ప్రజలకూ ఉపకరిస్తాయి.

## జనవాణి

3 పేజీ తరువ

కరపత్రాలు, ఆడంబరమైన పత్రికా ప్రకటనలు మాత్రం చేసి ప్రజల నుంచి లక్షలు దండుకొంటున్నాయి. ప్రజలనుంచి డబ్బు చేతికందిన తర్వాత మాత్రమే పొలాల కొనుగోలుకు సిద్ధపడుతున్నాయి. ఇది పచ్చి మోసం. ఆయా కంపెనీల ఉద్దేశ్యం మంచిదే అయినా, అది ప్రజలను వంచించడమే అవుతుంది. రేపు ఏ కారణంవల్లనో రైతులు పొలం అమ్మకపోయినా, దండిన డబ్బు ఏదో ఒక రూపంలో ఖర్చయిపోయి, కొను గోలుకు మిగలక పోయినా, భాగస్తులలో పేచీలు వచ్చి కంపెనీ మూత పడినా ప్రజలకు ఎవరు దిక్కు? అప్పుడు ఎవరు ఎవరికి ఏమని సమాధానం చెప్తారు.

కోట్లలో జరుగుతున్న ఇటువంటి అక్రమ వ్యాపారాల నిరోధానికి చట్టం ఏమి వసతి కల్పిస్తుందో పరిశీలించి, ప్రజలే సంఘాలుగా ఏర్పడి, తమను తామే రక్షించుకోవాలి!

– ఎం. రమాదేవి
నెల్లూరు

# 'చింతామణి' పేరుతో దాసరి కొత్త వివాదం!

నిప్పు లేనిదే పొగ రాదంటారు. అలాగే దాసరి లేనిదే తుఫాను లేదు అని సినిమా రంగంలో ఒక జోక్ వుంది. ఈయన చాలా కాలం క్రితం "చింతామణి" నాటకాన్ని తన స్వంత తారక ప్రభు పిక్చర్స్ పతాకంలో తెరకెక్కిస్తానని పాత్రికేయులకు ప్రెస్‌మీట్‌లో తెలిపారు. చింతామణిగా శ్రీదేవి, శ్రీహరిగా భానుమతి, సుబ్బిశెట్టిగా తాను నటించబోతున్నట్లు చెప్పారు. అపుడు నెల్లూరు, ఒంగోలు ప్రాంతాలనుంచి కొందరు వైశ్యులు తమ కులాన్ని కించపరిచే ఆ చిత్రం ప్రదర్శింప బడకుండా నిషేధించాలని పత్రికల మూలకంగా తమ నిరసన తెలియజేశారు. దానికి స్పందించి దాసరి ఆ చిత్రాన్ని మానుకొన్నట్లు ప్రకటించారు. రెండేళ్ళ క్రితం విజయ మాధవి పిక్చర్స్ వారికి అదే చిత్రాన్ని తీసిపెట్టబోతున్నట్లు దాసరి మళ్ళీ పాత్రికేయుల సమావేశంలో తెలిపారు. దీనికి రాయలసీమలోని ఆర్యవైశ్య సంఘంవారు అభ్యంతరం చెప్పినరికి మళ్ళీ దాసరి ఆ చిత్రాన్ని విరమించుకున్నట్లు పాత్రికేయులకు చెప్పారు. ఇటీవల ఆయన జన్మదినోత్సవ సందర్భంలో సురేష్ ప్రొడక్షన్స్ రామానాయుడు గారికి "చింతామణి"ని తీసి పెడ్తున్నట్లు ప్రకటించారు. దీనికి రాజమండ్రిలోని అఖిల భారత ఆర్యవైశ్య సమ్మేళనం నిరసన తెల్పుతూ, ఆ చిత్రం గనుక

**మద్రాసు సినిమా వార్తలు**

తయారైతే నిషేధించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరింది. ఏలూరు వాస్తవ్యులు అంబికాకృష్ణ, కాకినాడ మాజీ ఎం.ఎల్.ఏ. ముత్తా గోపాలకృష్ణ ఈ తీర్మానాన్ని ప్రతిపాదించారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలోని ఆర్య వైశ్య సేవా సంఘాల వారు దాసరి గనుక "చింతామణి" తీస్తే సుప్రీంకోర్టు స్థాయిలో అడ్డుకోవాలని నిర్ణయించారు. దీనికి ఒక కమిటీ కూడా, ధవళేశ్వరంలోని శ్రీవాసవి కన్యకా పరమేశ్వరి ఆలయం వద్ద ఏర్పాటు చేయడం జరిగింది. మళ్ళీ "చింతామణి"సినిమా ప్రయత్నాన్ని విరమిస్తున్నట్లు దాసరి ఎప్పుడు ప్రకటిస్తారా అని ఆయన పిలుపు కోసం సినిమా వారపత్రిక రిపోర్టర్లు ఎదురు చూస్తున్నారు. మొత్తం మీద స్టంట్ అంటే దాసరిదే! దర్శక రచయితగా కాదుగాని, స్టంట్స్ వేయడంలో దాసరికి దాసరే సరి!

## పూర్ణోదయా చిత్రం

" రెండు మనసులు కలుసుకున్న తర్వాత కట్టుబాట్లను అధిగమించినా ఫర్వాలేదనేది ఈ చిత్రం ప్రధాన ఇతివృత్తం " అన్నారు కె.విశ్వనాథ్. ఈయన కథ, చిత్రానువాదం, దర్శకత్వంలో ఏడిద నాగేశ్వరరావు నిర్మిస్తున్న పూర్ణోదయా

కొరవ 11 పేజిలో


ప్రేమాయణము లో శ్రీశాంతి

# తల్లిదండ్రులను నిర్లక్ష్యం చేసే కొడుకులకు గుణపాఠం చెప్పే → సూరిగాడు

అది కోర్టుహాలు. జడ్జి ధర్మాసనంపై కూర్చొని వారి, ప్రతి వాదుల వాదోపవాదాలు వింటున్నాడు. సూరిగాడు బోనులో నిల్చొని, కేసుకు సంబంధించిన తన పక్షం ఆధారాలు వివరిస్తున్నాడు. ఇంతకూ ఆ కోర్టులో జరిగే కేసు చాలా ఆసక్తి కరమైంది. వాచ్ మ్యాన్‌గా పని చేస్తున్న సూరిగాడు అనే తండ్రి, శ్రీమంతుల ఇంటి అల్లుడైన తన కొడుకు సత్యనారాయణ మీద వేసిన కేసు అది. తండ్రి, కొడుకు మీద కోర్టుకెక్కాడంటే వినడానికి ఆశ్చర్యంగానే వుంటుంది. కాని విధిలేని పక్షంలోనే తండ్రి తన కొడుకు మీద ఆ కేసు పెట్టాడు.

సత్యనారాయణ ఇంజనీరింగు చదువుతుంటాడు. తండ్రి నానా అవస్థలుపడి డబ్బు పంపుతుంటే దానితో అతను విలాసంగా జీవిస్తూ, బాగా డబ్బున్న వాడిలా నటిస్తూ, ఆశ అనే శ్రీమంతుల అమ్మాయిని ప్రేమిస్తున్నా తండ్రి సహించాడు; తన కొడుకు తనను వంట వాడిగా తన మిత్రులకు పరిచయం చేసినా తండ్రి సహించాడు; తాను వాచ్ మ్యాన్ సూరిగాడి కొడుకును కాదని ఉద్యోగం ఇంటర్వ్యూలో తనకొడుకు చెప్పినా తండ్రి సహించాడు; తనను కాదని కొడుకు శ్రీమంతుల బిడ్డ ఆశను పెళ్ళి చేసుకున్నా సహించాడు. కొడుకు, అతని మామ కలిసి సూరిగాడు వున్న ఇంటిని అమ్మేసి, సూరిగాడిని తమ ఇంటి వాచ్ మ్యాన్‌గాను, సూరిగాడి భార్య మాలక్ష్మిని తమ వంట మనిషిగాను నియమించుకున్నా తండ్రి సహించాడు. తనను, తన భార్యను భార్యను తల్లి దండ్రులుగా తన కొడుకు గుర్తించక పోయినా తండ్రి సహించాడు. కాని తల్లికి తీవ్రమైన జబ్బు చేసి అమెరికాలో ఆపరేషన్ చెయ్యవలసిన పరిస్థితి వచ్చినప్పుడు అందుకు అవసరమైన

**చిత్రసమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

మూడు లక్షల డబ్బు యివ్వక తల్లిని నిర్లక్ష్యం చెయ్యటం మాత్రం ఆ తండ్రి సహించలేక పోయాడు. కొడుకు మీద కక్ష సాధింపుతో అతని మీద కోర్టులో కేసు వేస్తాడు తండ్రి. కొడుకు తల్లి దండ్రులను నిర్లక్ష్యం చేసినందున, ఆ కొడుకు పుట్టినప్పటి నుంచి పెంచి పెద్దచేసి నందుకు, చదువులు చెప్పించి నందుకు అయిన ఖర్చు లెక్కగట్టి కొడుకు దగ్గర వసూలు చేసేందుకు కోర్టులో కేసు వేస్తాడు తండ్రి. కేసు గెలుస్తాడు. కొడుకునుంచి నాలుగు లక్షల రూపాయలు రాబట్టు కుంటాడు. ఆ డబ్బుతో సూరిగాడు అతని భార్య మాలక్ష్మి విమానంలో అమెరికాకు బయలు దేరుతారు ఆపరేషన్ కోసం.

ఈ కోర్టు సీను చిత్రానికంతా ఆయువుపట్టు. అక్కడ జరిగే ఇరు పక్షాల వాదోపవాదాలు, తల్లి దండ్రులను నిర్లక్ష్యం చేసే కొడుకులకు బాగా బుద్ధిచెప్పేవిగా వున్నాయి. సూరిగాడుగా దాసరి నారాయణ రావు గొప్పగా నటించాడు. కోర్టు సీనులోనే కాదు, చిత్రం మొత్తానికి తన ఉత్తమ నటనతో ప్రాణం పోశాడు దాసరి. ఈ చిత్రంలోనూ దాసరిలోని దర్శకుడి కంటే, అతని లోని నటుడు ధీటుగా కనిపించాడు. మాలక్ష్మిగా సుజాత చాలా సహజంగా నటించింది. సత్యనారాయణ పాత్రను రూపొందించటంలో వెలితి కనిపిస్తుంది. ఈ పాత్రకు సంబంధించి శ్రీరాజ్ వ్రాసిన మాటల్లోను పటుత్వం కనిపించలేదు. ఈ పాత్రను నటనా పరంగా కూడా సురేష్ తృప్తి పరచలేక పోయాడు. ఆశ పాత్రలో యమున బాగా రాణించింది. ఆశ తండ్రి గొల్లపూడి మొదట సున్నితమైన హాస్యం, ఆ తర్వాత కరుకైన విలనీ చూపాడు. బ్రహ్మానందం కామెడీ ఆడనేపంలో మొరటుగా ఉంది. నిర్మాత డి. రామానాయుడు తన చిత్రాల్లో ఏదో ఒక చిన్న పాత్ర వేస్తుంటాడు. ఇందులో జడ్జిగా గంభీరంగా కనిపించాడు.

భువన చంద్ర వ్రాసిన పాటతో సాగిన ఆశ పుట్టిన రోజు పండుగ వాసూరావు సంగీతంలో వీనుల విందుగా ఛోటానాయుడు ఫోటోగ్రఫీలో కన్నుల పండువగా సాగింది. మొత్తం మీద ఈ చిత్రం సురేష్ ప్రొడక్షన్ స్థాయిని నిలిపింది.

# శోభనాల కంటే చెమ్మాచెక్కాలే నయం

పి.యస్. రామచంద్రరావు దర్శకత్వం వహించే చిత్రం పేరు"చెమ్మాచెక్కా". మన నేటినీటికి తగ్గట్టుగా ఉందని ఆ పేరు పెట్టారు. ఈ టైటిల్ స్ఫూర్తితో మరికొందరు నిర్మాతలు తమ చిత్రాలకు "కోతి కొమ్మచ్చి, తొక్కుడుబిళ్ళ, బిల్లాకోడు, చిక్కు చిక్కు పుల్ల , వీరాముష్టి వీరెవరు, వంటి పేర్లు పెట్టినా మనం ఆశ్చర్య పోనక్కర్లేదు . టైటిల్‌ను చిత్ర కథలో ఎలా సమర్థించుకున్నా ఫర్వాలేదు. అతికినా అతకకపోయినా !" శోభనం నాకు" వంటి అధ్వాన్నం పేర్లకన్నా చెమ్మాచెక్కాలే నయం ఈ చిత్రంలోని హరీష్, నవ నాయిక సౌందర్య, సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, శుభలేఖ సుధాకర్, బాబు మోహన్ రావికొండలరావు, అలీ, షావుకారు జానకి, పూజిత, సౌందర్య, అత్తిలి లక్ష్మి, జయశీల, జయలలిత పాత్రధారులు.

## మద్రాసు లో " దేవదాసు "

మద్రాసులో ప్రముఖులకు 'యోగథెరపి 'శిక్షణ ఇవ్వడంలో సుప్రసిద్ధుడైన నెల్లూరీయుడు పి. చెంచురామిరెడ్డి ఎంత చక్కని నటుడో తెలియని వారెవరూ ఉండరు. అందునా దేవదాసు పాత్ర ఆయనకు కొట్టిన పిండి. ఈ విషయం మే 10 వ తేదిన మద్రాసు వాణీమహల్‌లో స్వాతి ఆర్ట్ థియేటర్స్ప్రదర్శించిన ఆనాటకం మరో సారి నిరూపించింది. ఆయనతోపాటు కాకరాల, రాళ్ళబండి కామేశ్వరరావు, శ్యామల, బిందు మాధవి ప్రభృతులు పాత్రోచితంగా నటించి, నాటకాన్ని రక్తికట్టించారు. చివరి సీను ప్రేక్షకుల కంట తడి పెట్టించింది. లక్ష్మీకిరణ్ బృందం సంగీతం ప్రశంసనీయంగా వుంది. చాలా కాలం తర్వాత ఒక చక్కని నాటకాన్ని చూశామనే తృప్తి ఆనాటి ప్రేక్షకులకు కల్గింది.

## ప్రజలంటే ప్రీతి

(2 పేజీ తరువాయి)

మనసు విప్పి చూడలేము; ఆక ముందు చూడలేము. విశాలమైన భారత దేశాన్ని, భారతీయ ప్రజలను తెలుసుకోవడానికి ఆయ న ఎప్పుడూ ప్రయత్నించేవారు. తనకు, ప్రజలకు మధ్య సెక్యూరిటీ సిబ్బంది అడ్డుగావడాన్ని సహించే వారు కారు.

1991 మే మొదటి వారంలో రాజీవ్ ఖమ్మం పర్యటనకు వచ్చారు. మేమిద్దరం ఓపన్ టాప్ జీపులో వెళ్తున్నాం. జోన్‌లోని రోడ్డుకు రెండువైపులా అసంఖ్యాక పైన జనసందోహం రాజీవ్‌కు స్వాగతం చెప్తున్నది. పోలీసులు వారిని జీపుకు సమీపంగా రానివ్వకుండా నెట్టేస్తున్నారు. అది గమనించిన రాజీవ్ పోలీసులను నివారించారు. వారు ఆయన మాటలు విన్పించుకోలేదు. అంతే, రాజీవ్ జీపు దిగి జనంలోకి నడిచి వెళ్ళిపోయారు. ఇంకొక చోట సెక్యూరిటీ సిబ్బంది ఒక వృద్ధస్త్రీని ప్రక్కకు తోయడం గమనించారు. రాజీవ్ జీపు ఆపి, ఆమె దగ్గరకు పోయి, పలకరించారు. ప్రక్కనేవున్న నేను, ఆమెకు కొంత డబ్బు ఇచ్చి పంపితే బాగుంటుందేమో అన్నాను. దానికాయన తక్షణమే నిరాకరించి " జనార్దన్, అటువంటి అభాగ్యుల సమస్యలకు డబ్బు సమాధానం కాదు; వారికి ఎప్పుడూ డబ్బు ఇవ్వజూడకు " అన్నారు. క్రిందపడిన స్త్రీని పలుకరించి, భుజం తట్టడంతో ఆమె సంతోషంగా వెళ్ళిపోయింది.

21 తేది సాయంత్రం విశాఖ నగర వీధుల్లోనూ అపరిమిత ప్రజానీకం తనను సమీపించడానికి, తాకి ఆనందించడానికి తపన పడటం రాజీవ్ దృష్టికి వచ్చింది. మేమున్న జీపును అనుసరించి వస్తున్న రెండు ఎస్కార్ట్ కార్లు, దగ్గరకు రాబోతున్న ప్రజలను ప్రక్కకు నెట్టేస్తుండినారు. ఆ రెండు కార్లను ప్రక్కకు తొలగిపొమ్మన్నారు రాజీవ్. కాని వారు విన్పించుకోక మమ్మల్ని అనుసరించడం ప్రారంభించారు. వెంటనే, రాజీవ్ జీపు దిగి, నెమ్మదిగా, నిర్వికారభావంతో ఆ ఎస్కార్ట్ కార్లవద్దకు వెళ్ళి, ఇంజన్లు తానే ఆపి, తాళాలు చేతికి తీసుకొని తిరిగి జీపు ఎక్కేశారు. ఆ తాళాలు నాచేతికి ఇచ్చారు. తనచుట్టు వున్న సెక్యూరిటీ సిబ్బంది తనను ప్రజలనుంచి దూరం చేస్తున్నారని రాజీవ్ అభిప్రాయం. అయితే ఆ కోపం ఎప్పుడు సెక్యూరిటీ సిబ్బందిపై ప్రదర్శించలేదు. వారికి నచ్చచెప్పి, బ్రతిమలాడి, తనకు ప్రజలకు మధ్య అడ్డు రావద్దని చెప్పేవారు.

వ్యక్తిగతంగా నేనంటే రాజీవ్ గాంధికి ప్రత్యేక అభిమానం. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా నన్ను నియమించడానికి ఆయన రెండు సార్లు ప్రయత్నించారు. అంజయ్య రాజీనామా చేసినపుడు నన్ను పదవి స్వీకరించమని చెప్పారు. భవనం వెంకట్రాం తర్వాత కూడా నన్ను ముఖ్యమంత్రిని చేయాలని అభిలషించారు. అయితే రెండు సందర్భాలలోను ఏ కారణం వల్లనైతేనేమి, ఆ ప్రయత్నం ఫలించలేదు. తిరిగి 1990 డిసెంబరులో ఆయనే నన్ను ముఖ్యమంత్రిని చేశారు.

రాజీవ్ గాంధి ఉత్సాహం, కార్యోన్ముఖత్వం అవధులు లేనివి. జీవితమంటే ఆయనకు విశిష్ట అభిలాష! భారత దేశాన్ని 21 శతాబ్దపు ముంగిట శాస్త్ర సాంకేతిక పరంగా అత్యున్నత స్థానంలో నిలబెట్టాలని, దేశంలోని వివిధ వ్యవస్థలను ఆధునీకరించాలని రాజీవ్ తపన. అందుకు ఆయన ఏ సిద్ధాంత సంకెళ్ళనూ దరిచేరనివ్వ లేదు. ఆచరణాత్మక విధానాలే అనుసరణీయాలని నమ్మే వాస్తవిక వాది ఆయన. ప్రతి ఒక్కరూ తన లాగే వుండాలని కోరుకునేవారు. ఆవాస్తవిక, ఆచరణాత్మక విధానాల ప్రేరణే, నన్ను, నాతోటి కాంగ్రెస్ వాదులను తిరుపతి ప్లీనరీ నిర్వహణకు ప్రోత్సహించాయి. 33 రోజుల స్వల్ప వ్యవధిలో మేమక్కడ రాజీవ్‌కు ఘన నీరాజనంగా రాజీవ్ నగర్ నిర్మించాం.

ఈ దేశమాత కన్న ఒక సుందర స్వప్నం - రాజీవ్ గాంధి. ఆయనే చెప్పేవాడు- నేనీ దేశానికి ఒక కల వంటి వాడిని, సుదృఢము, సర్వ స్వతంత్రము, స్వయంపోషకము, ప్రపంచదేశాల ఎదుట సగర్వంగా నిలబడే సామర్థ్యము కలిగిన భారతమాతకు నేను నిజంగా స్వప్నం వంటి వాడిని ' అని! ఆ అమృత మూర్తికి, ప్రేమ వంటి హృదయుడికి, ప్రజానాయకుడికి మనం అర్పించే ఘనతర నివాళి ఏదైనా వుందీ అంటే - అది సుస్థిర స్వయం పోషక భారత దేశ నిర్మాణమే. 1991 ఎన్నికల ప్రణాళిక ద్వారా రాజీవ్ గాంధీ 90 వ దశకానికి మన కందించిన కార్యక్రమం- ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుకు కరదీపికవలె ఉపకరిస్తున్నది. అదే మనల్ని మన దేశాన్ని 21 శతాబ్దపు ముంగిలికి చేరుస్తుంది.

రాజీవ్ గాంధీ చని పోయారు; కాని ఆయన ఆదర్శాలు మాత్రం చిరస్థాయిగా సజీవమై వుంటాయి.

[రాజీవ్ ప్రథమ వర్ధంతి సందర్భంగా, ఆయన అంతిమ క్షణాలలో ప్రక్కనే వుండిన ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి, ఆ స్మృతులను అక్షర రూపంలో పెట్టారు. అదే ఈ వ్యాసం. సం.జ.రై]

1990 డిసెంబరులో హైదరాబాదు మత కల్లోలాల సందర్భంగా పాత బస్తీలో పర్యటించిన రాజీవ్ గాంధీతో ముఖ్యమంత్రి ఎన్. జనార్ధన రెడ్డి


**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 75.00 |
| ఆరు నెలలకు | రూ. 40.00 |
| విడి ప్రతి | రూ. 1.50 |


## హమారా రాజీవ్ మహాన్

* భరత్ కుమార్ రెడ్డి. వి *

తలవంచుక.. వెళ్ళిపోయావా,
రాజీవా!
నెలవంటూ ఈ లోకాన్ని వదిలి....
తలపోసినవన్నీ కొనసాగకపోగా,
ఆవేదన బరువు కాగా,
రాజకీయపు మురికి తనం,
కరుకుతనం
నీ సుకుమారపు హృదయానికి
గాయం చేస్తే,
బాధపడుతూ
తలవంచుక వెళ్ళిపోయావా,
రాజీవా!
ధూర్తులవలె మెసలే
ఈ ధూర్త లోకంలో నిలబడజాలక
తలవంచుకునే వెళ్ళిపోయావా,
రాజీవా!
చిరునవ్వులనే పరిహసన చేస్తూ.....
అడుగడుగునా పొడచూపే
అనేకానేక శత్రువులతో,
పొంచి చీకట్లో కరవజూచే
పంచకుల తో,
స్వార్థ సంకుచిత శక్తుల
ఈ లోకంతో పొసగక,
అంచితానంద శాంతి సామ్రాజ్యం
దేన్ని వెతుక్కుంటూ వెళ్ళావయ్యా,
రాజీవ్ భయ్యా!
ఎంత అన్యాయం చేశావయ్యా
ఎన్ని ఆశలు నీ మీద పెట్టుకొని
ఎన్ని కలలు నీచుట్టూ ప్రోగు
చేసుకొని
అన్నీ తన్నివేశావా, రాజీవా!
ఎంత దారుణం చేశావయ్యా!
ఇండియన్ పార్లమెంటులో
నిన్నగాక మొన్న
మాట్లాడుతున్నట్లే ఉంది,
స్వాతంత్ర్యదినోత్సవ వేడుకల్ని
కళకళలాడించిన నీ నవ్వు
కనబడకుండా కరిగి పోయిందా
ఇంతట్లోనే!
ఆకాశంలో చుక్కలు లెక్కిస్తూ
విమానపు పైలెట్‌గా పోతున్న నిన్ను
ఈ లోకం రెక్క పట్టి, నిలబెట్టి
భారతదేశపు పైలెట్‌గా చేసి,
ఎన్నెన్ని దుస్సహ దృశ్యాలు
చూపించి,
ఎన్నెన్ని దుష్ట విఘ్నాలు కల్గించి,
కర్కశ పొగలనూ, చీకటి తెరలనూ
కప్పి
శపించిందో నిన్ను
తుదకు నిన్ను విషవాగురలోనికి
లాగి,
ఊపిరి తిత్తులను కొలిమి
తిత్తులుగ చేసి
మా కళ్ళలో దుఃఖపు జ్వాలలు,
గుండెలలో గుగ్గిలపు ధూమం వేసి,
మా దారిలో ప్రశ్నార్థ చిహ్నాలు
బ్రహ్మచెముడు డొంకలు కప్పి
తలచుకొన్నప్పుడల్లా తనువులో,
అణువుఅణువులో
భయంకర దుఃఖాన్ని రేగిస్తూ,
కల్గిస్తూ
ఎక్కడకు విసిరిందయ్యా నిన్ను
ఎంత మోసగించిందయ్యా మమ్ము.
నీవు పంచిపెట్టిన మైత్రిని,
మానవత్వాన్ని
మట్టిలో పాతిపెట్టి, మనుషుల్ని
కాల్చేస్తున్నారు.
దేశభక్తిని కూల్చేస్తున్నారు,
కలలు కనే కన్నతల్లి కడుపును
చీల్చేస్తున్నారు.
అన్ని ఆపదలకు తట్టుకొగలిగే నీ
ఆత్మవిశ్వాసాన్ని
హత్యచేస్తున్నారు
నిరుత్సాహాన్ని జయించడం నీ
వల్లనే నేర్చుకొంటున్నాము
ప్రతికూలశక్తుల బలం మాకు
తెలుసు
భయం లేదులే అయినప్పటికీ
నీ సాహసం ఒక ఉదాహరణ
నీ జీవితం ఒరవడి
రాజీవా,
శక్తిస్థల్ సాక్షిగా చెప్తున్నాం
సత్యాన్ని హత్య చేయబూనే
శక్తులకు ఓటమి తప్పదు,
ప్రళయాలు ఎన్ని వచ్చినా
నీ ప్రజాశక్తికి విజయం తప్పదు,
నిన్న వదలిన పోరాటం,
నేడు అందుకొనక తప్పదు
(శ్రీశ్రీకి క్షమాపణలతో)

# కాపురుష్

(4 పేజీ తరువాయి)

అతనిలో గంభీరంగా దాగివున్న విశ్వాత్మ విరాట్రూపం వ్యక్తమవుతూ వస్తుంటుంది.

ఈ 'కాపురుష్' లో మూడే మూడు పాత్రలు - ఒక భార్య, భర్త, మూడో పాత్ర వొక సినీ రచయిత.

ప్రేమేంద్రమిత్రగారు వ్రాసిన ఒక కథానికను తీసుకొని ఎంత సహజ సుందరంగా, ఎంత మనోజ్ఞకరంగా, ఎంత సర్వతా సంస్కారయుక్తంగా చిత్రం తీయడానికి అవకాశముందో నిరూపించారు శ్రీరే . మొత్తం ఒక ఖండ కావ్యంగా రూపొందించారు.

ఒక రోజు రాత్రి ఆ సినీ రచయిత బస్సు చెడిపోయి పెట్రోలు బంకులో తారట్లాడుతుంటే - వొక స్నేహ శీలి తారసిల్లి తన యింటికి తీసుకెళ్లారు. ఆ ఇంట్లో ఆ మిత్రుని భార్య తన పూర్వ ప్రేమికురాలు, స్నేహితురాలు: వొక విధంగా తనకు భార్య కావలసిన ప్రియురాలు. ఆ మిత్రుడు బాగా తాగి, సుష్టుగా భోంచేసి నిద్రపోతారు. — యీ సినీ రచయితను వొక గదిలో పొదరంగాదింపి ! తన పూర్వ ప్రేమికురాలు యి ఈ మిత్రుని భార్యగా ఆ యింట్లో తటస్థ పడ్డంతో తమ చిన్ననాటి తీయని ప్రేమోదంతాల జ్ఞాపకాల కెరటాలతో నిద్రపట్టక అమెను నిద్ర మాత్రలడిగి తీసుకుంటాడు. ఆమెతో ఏవేవో మాట్లాడాలని, మనసు మనసు కలబోసుకుని మాట్లాడుకోవాలని ప్రయత్నిస్తారు. - అది అంతగా వీలు పడదు. ఎంతో తపించి పోతారు.

ఆమె భర్త త్రాగుడుకు బాగా అలవాటు పడ్డాడనే గాని, నిర్మల హృదయుడు. స్నేహపాత్రుడు. ఏ అసూయలు, అనుమానాలు లేని నిరామయుడు. శిశుసన్నిభుడు. ఫర్ఫెక్ట్ జంటిల్మెన్. ఆ తర్వాత రోజు ఆ మిత్రుడు తన భార్యను వెంట బెట్టుకుని యి సినీ రచయితను జీపులో కూర్చొబెట్టుకొని రైల్వేస్టేషన్లో దింపుతారు. అర్థమైన 'పెండాఫ్' చిత్రం 'ఎండింగ్' చూడాల్సిందే గాని చెప్ప తగింది గాదు. ఏ అసభ్యమైన సన్నివేశమూ లేదు ఏదుర్మార్గపు ప్రవర్తనా లేదు. ఇందులో ఎవరు "కాపురుష్?" ముగ్గురూ ముగ్గురు మహామనీషులు.

తర్వాతి చిత్రం-" మహాపురుష్" ఒక దొంగ స్వాములవారి మహాపురుషుడుగా లోకం చేత ఎంచబడుతున్న ఆ స్వాములవారు కథను దగుల్బాజీ మోసగారి బూటకపు స్వామిగా బుడావు చేయబడ్డారు. చిత్ర ప్రారంభం ఎండింగ్ ఎంతో సృజనాత్మకంగా, సజీవంగా, సున్నితంగా గడిచి పోతుంది. - మధ్య కొంచెం అక్కడక్కడా 'డ్రాగింగ్' అనిపించినా మధుర పదార్థం తిన్న నోటితో ఏదో చేదు వస్తువు తిన్నట్టుగా అంత గొప్ప చిత్రం చూచిన కళ్ళతో మన దౌర్భాగ్యపు తెలుగు సినిమాలు చూసేదెట్లా అన్పించకపోదు.

(5-1-1968 సంచికలో స్వర్గీయ బంగోరె తన కూనిరాగాల శీర్షికలో చేసిన చిత్ర సమీక్ష ఇది)

## భోగభూమితో కర్మభూమి

'రసిక్'

నీవూ నేనూ ఒకే భూమాత కడుపున
పుట్టిన వాళ్ళం కనుక
నీవు నా సహోదరుడివి; అయితే
నీ కన్నా రమారమి ఓ అయిదు వేల
సంవత్సరాల క్రితం
నేను జన్మించిన వాణ్ణి కనుక నాకు
నీవు తమ్ముడివి;
కావడానికి నీవు తమ్ముడవైనా
కావలసినంత లక్ష్మీ కటాక్షం
లభించిన నువ్వు
కుబేరునికి అప్పు ఇవ్వగల స్థితి
కెదిగావు;
కుబేరుని దగ్గర తన పెళ్ళి కప్పు
తీసుకున్న మా దేవునికి
వడ్డీ కానులు సమర్పించుకొనే
పరిస్థితి నాది;
పరిమిత సంతానం నీది;
కుచేల సంతతి నాది
అపరిమితమైన ప్రకృతి
వనరులున్నాయి నీకు;
పగబట్టిన ప్రకృతి బీభత్స
పరంపరలున్నాయి నాకు;
నీ యిల్లంత లేదు నా పొలం.
మరి నీ పొలం పరిధి నా చూడ్కి
కందేనా?
ఇదంతా ఏదో ఈసుతో, అసూయతో
కాదు
ఏకరవు పెట్టడమిప్పుడు,
సమయం, సందర్భం వచ్చినవుడేగదా
పలుకమని పెద్దల కట్టడి;
"జేష్టుణ్ణి గనుక జేష్టాదేవి కృపనాకు,
చిన్నవాడవు కనుక చిన్నమ్మ
చిరునవ్వు నీకు"
అని సరిపెట్టుకోగల మనసుంది
నాకు;
ఆ మనసుతోనే నిన్ను గౌరవించాను.
నీకు మేలు కోరాను;
నా పట్ల నీకు అదే గౌరవమున్నదని
భావించి
నీవరువుగా యిచ్చినవి, దానమిచ్చినవి
కృతజ్ఞతాభావంతో నేపుచ్చుకొన్నాను;
క్రొత్తగా నీ ఎదలో ఏదో కిరికిరి
బయలు దేరింది.
నన్ను సంశయంగా చూడడం
మొదలెట్టావు.
నాలో లేని వంచనా భావం
పసిగట్టుతున్నావు.

నేను పూరించని సమరశంఖారావం
వింటున్నావు.
నేను జపిస్తోన్న శాంతి మంత్రాన్ని
శంకిస్తున్నావు.
నా స్వేచ్ఛాప్రవంతి కడ్డుగా
కొండవలె నిలుస్తున్నావు;
మన సహోదరులందరిలోకి
మన యిద్దరి వీధి గుమ్మాలకే తెరలు
లేనిది;
అందుకే నీ కలిమి, నా లేమి
అందరికీ తెలుసు;
తతిమ్మా గుమ్మాలకు కట్టివున్న
తెరల మూల్యా
లోగుట్టు పెరుమాళ్ళకెరుకే మరి;
ముఖ్యంగా "ఇనుప తెర"
యింటి విషయం
బోధపడక నీవు కాస్త జంకే వాడివి;
ఆ ఇనుప తెర మంచు తెరగా మారి
నీరు కారి పోవడంతో
ఆ యింటి వారూ
నిన్నాశ్రయిస్తూండడంతో
నీ కిక పగ్గాలు లేకుండా పోయి
హుంకరిస్తున్నావు. గర్జిస్తున్నావు
మంచీ మర్యాదా మానుకున్నావు.
చిన్నాపెద్దా గమనించకుండా
చిందులు త్రొక్కుతున్నావు;
అంతదాకా వచ్చింది కనుక
చెబుతున్నాను విను.
మనల్ని కన్న నింగి తండ్రి. నేల
తల్లి సాక్షిగా చెబుతున్నాను విను-
నా ఇల్లాలు కవిత, నా గురువు
వేదాంతం, నా మిత్రుడు ధర్మం,
నా శస్త్రం సత్యం, నా అస్త్రంఅహింస
నా తత్త్వం భిన్నత్వం లోఏకత్వం-
నీ ఇల్లాలు వాణిజ్యం, నీ గురువు
సైన్సు, నీ మిత్రుడు టెక్నాలజీ
నీ శస్త్రం సేన,
నీ అస్త్రం అణుబాంబు
నీ తత్త్వం ఏకత్వంలో భిన్నత్వం -
నా దారి బుద్ధుని దారి, నీ త్రోవ
అలెగ్జాండరు త్రోవ.
నాది కర్మభూమి, నీది భోగభూమి -
నీవంటున్నావు "వంగు, లొంగు"
అని -
నేనంటున్నాను
"నేను 'జయ'ను, అపరాజితుణ్ణి
అని
సర్వేజనాః సుఖినోభవంతు అని"

## సినిమా

9 పేజీ తరువాయి

వారి తాజా చిత్రంలో చిరంజీవి మామగా రచయిత జంధ్యాల నటించడం ఓ విశేషం. మీనాక్షి నాయిక . సత్యనారాయణ, అల్లురామలింగయ్య, బ్రహ్మానందం, గీత, శిల్ప, ఇతర పాత్రధారులు. మాటలు: జంధ్యాల ;గీతాలు:సి.నారాయణ రెడ్డి, సీతారామశాస్త్రి ;సంగీతం:కీరవాణి; ఛాయ: విన్సెంట్;సహదర్శకుడు: నందూరి విజయ్ ; చిరంజీవి శివుడి గెటప్‌లో చేసే నృత్యాన్ని పన్నెండు రోజులపాటు చిత్రీకరించారట. ఇది తెరమీద తొమ్మిది నిమిషాల పాటు ఉంటుంది. కె. విశ్వనాథ్ హిట్ చిత్రమిచ్చి చాలా కాలమైంది. ఈ చిత్రం ఆ కొరతను తీరుస్తుందని ఆశిద్దాం.

### మరో వారసుడు

" మా అన్నగారు ఎన్.టి.రామారావు గారు నాకు ఆదర్శమూర్తి "అని సదా పలికే మోహన్ బాబు ఒక విషయంలో ఆయన్ని అనుకరించబోతున్నారు. "బ్రహ్మ"లో ఎనిమిదేళ్ళ తన తనయుడు మనోజ్ కుమార్‌ను నటింప జేస్తున్నాడు. ఆ అబ్బాయికి బాల్యం నుంచే ఫైట్స్, డాన్సులు నేర్పించాడు. మరి కొంత కాలం పోయిన తర్వాత ఆ అబ్బాయి హీరోగా తాను తీసే చిత్రంలో తానే విలన్‌గా నటిస్తాడట! చూసే వాళ్లుంటె ఇలాంటి గమ్మత్తులు ఇంకెన్నో చేయవచ్చు. చిరంజీవి మనోజ్ కుమార్‌కు సుస్వాగతం

### అన్నదమ్ములుగా శోభన్‌బాబు, బాలకృష్ణ

ఇప్పుడు శోభన్‌బాబు జీవితం వడ్డించిన విస్తరి. హాయిగా కాలుమీద కాలు వేసుకొని విశ్రాంతి తీసుకుంటున్నాడు. తన ఐశ్వర్యాన్ని ఇంకా పెంచుకోవాలని లేదు. ఉన్న దానితో తృప్తిగా, నింపాదిగా గడపడమే ఆయన మతం. ఎవరైనా మంచి కేరెక్టర్ ఉందని ఆహ్వానిస్తే, ఒప్పుకుంటున్నారు. ఇటీవల ఆయన కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మితమౌతున్న వైజయంతి మూవీస్ చిత్రంలో బాలకృష్ణ అన్నగా నటిస్తున్నాడు. బాలకృష్ణ సరసన నగ్మా, మీనా హీరోయిన్‌లు. అంతవరకు బాగానే వుంది గాని విలన్‌లుగా అమ్రీష్‌పురి, పరేష్ రావల్ వంటి బొంబాయి నటులను ఎంతో ఎక్కువ పారితోషికం చెల్లించి దిగుమతి



నెల్లూరులో జరిగిన సిరిమల్లి చిట్స్ సంస్థ ప్రారంభోత్సవ కార్యక్రమంలో ఆనం రామనారాయణ రెడ్డి, సంస్థ నిర్వాహకులు.

చేసుకోవడం ఎందుకు? ఆమాత్రం దుష్ట పాత్రలను పోషించే గాని తెలుగు నటులు లేరా? ఇతర భాషా నటులను పెట్టుకుంటేనే వైరైటీ అవుతుందా?

### మరో తార వివాహం

కక్కు వచ్చినా -కల్యాణం వచ్చినా ఆగదంటారు. భానుప్రియ ఎంత దాచడానికి ప్రయత్నించినా ఆమె ముఖంలో ఇటీవల పెళ్ళి కళ కనిపిస్తోంది. వరుడు చికాగోలో పెద్ద పారిశ్రామిక వేత్త అట. ఆంధ్రుడే . ఆమధ్య భానుప్రియ నృత్య ప్రదర్శన ఇవ్వడానికి అమెరికా వెళ్ళినపుడు ఇద్దరికీ పరిచయం ఏర్పడింది. మనసులు ఇచ్చి పుచ్చుకున్నారు. ఇద్దరి తరపు పెద్దలూ 'శుభం' అన్నారు. ఇక భానుప్రియ భవంతి ముందు పందిళ్ళు కనిపించడం, సన్నాయి వినిపించడం, భానుప్రియ ఇప్పుడు నటిస్తున్న తమిళ చిత్రాలన్నీ పూర్తవడమే తరువాయి.


జమీన్‌రైతు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 75.00 |
| ఆరు నెలలకు | రూ. 40.00 |
| విడి ప్రతి | రూ. 1.50 |

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.